

Chandamama, March '49

Photo by B. Ranganadham

"పాపకు ఆ లోటాలో దాచిన పాలు తేవే"



## భూమినుండి సంపద

# రబ్బరు

మీరందరు రబ్బరును ఏదో ఒక అకారములో చూచియే వుంటారు. నేటి యంత్రాల యుగములో దీనియొక్క ప్రాముఖ్యత రానురాను అధికమగుచున్నది. మోటారుకార్లు, విమానాలు, సైకిళ్ల వగైరాలలో ఇది వుపయోగింపబడుచున్నది. మరియు బొమ్మలు, బెలూనులు, రబ్బరు గొట్టాలు, చాపలు, వేడిసీటి సంచులు ఇత్యాదులను చేయుటలో కూడా ఇది ఉపయోగించబడుచున్నది. ఇంత యేల. నేటి పరిశ్రమలలో రబ్బరు అత్యావశ్యకముగా తయారైనది.



అతి ఉష్ణము, విశేషమైన వర్షముపడే భూమధ్యరేఖా ప్రాంతములలో పెరిగే చెట్టు రబ్బరు. ప్రపంచమంతట సప్లయి అయ్యే రబ్బరుకు దక్షిణ ఆశియా ముఖ్య మూల స్థానముగా నున్నది. మలయా ద్వీపకల్పములో మాత్రమే నూటికి 50-వ వంతు ఉపయోగించబడుచున్నది. భారత దేశములోని మొత్తము 124,300 ఎకరాలలో నూటికి 78-వ వంతు తిరువాన్కూరులో, 9-వ వంతు మదరాసులో 7-వ వంతు కొచ్చిన్‌లో సుమారు 6-వ వంతు కూర్గు మరియు మైసూరులో ఉపయోగించబడుచున్నది.

ఈ వరుసను టాంకో స్క్రాప్ పుస్తకములో ప్రోగుచెయ్యండి.

ఈ ప్రకటనతో "భూమినుండి సంపద" అనే వరుస పూర్తి అయినది.

వచ్చే సంచికనుండి మరొక ముచ్చటైన వరుసను మీకు అందజేస్తాము.

ప్రకటనదారులు :

501 & హమామ్ సబ్బులను

తయారుచేయు




ది తాతా

ఆయిల్ మిల్స్

కంపెనీ లిమిటెడ్

చందమామ

ఈ సంచికలో యివి

చదువుకోండి


| విషయము | | పేజి |
|---|---|---|
| తోలు - డోలు | .... | 10 |
| ప్రాద్దుతిరుగుడు పువ్వు | | 13 |
| బాలనాగమ్మ | ... | 17 |
| పాపిష్టి ముఖాలు | ... | 25 |
| కాకమ్మ జామీను | .... | 30 |
| అనుమానం | .... | 33 |
| గాజు రేగుపండు | .... | 36 |
| బ్రహ్మరాత | .... | 41 |
| చిత్రం విచిత్రం | ... | 47 |
| బీరబల్ వినోదాలు | .... | 50 |
| పిల్లల పెంపకం | .... | 52 |
| జోలపాటలు | ... | 54 |
| విజ్ఞానంలోని గమ్మత్తులు | | 55 |


ఇవన్నీగాక పజిలు, ముగ్గులు, చిక్కుచదరాలు, చిక్కుబొమ్మలు, ఇంకా, ఇంకా ఎన్నోవున్నై.

**చందమామ ఆఫీసు**
పోస్టుబాక్సు నెంబరు. 1686
మద్రాసు. 1.

స్త్రీత్వపు వికాసము
ఆరోగ్య సౌందర్యము



పండిత డి. గోపాలాచార్యులవారి

# అరుణ

గర్భశయ్య రోగనివారిణి




ఆరోగ్యమే సౌందర్యం. నిశ్చింతమైన ఆరోగ్య జీవనము ప్రతి స్త్రీకి జన్మ హక్కు. ఋతుదోష నివారిణి 'అరుణ' విశ్వసనీయమైన స్త్రీజన మిత్రము. స్త్రీలకు ప్రత్యేకమగు వ్యాధులన్నింటిని పారద్రోలి వారికి ఆరోగ్య ఆనంద జీవనమును ప్రసాదిస్తున్నది. ఏబదియేండ్ల అనుభవ బలముగల 'అరుణ' మీకు అండగా నిలుచును గాక.



**ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్**
(స్థాపితము 1898)
మద్రాసు. 17

గ్యారంటీ

# స్టెయిన్‌లెస్ స్టీల్ పాత్రలు

మాసిపోవు, ఎప్పుడు కాంతిగా నుండును.
చౌక, అందమైనవి.
లోటాలు, డబరా, టిఫన్ కారియర్లు, కప్పులు, అడుగుపెట్లు, స్పూనులు, ప్లేట్లు. పచ్చడి కిన్నం పెట్లు, జెల్లిగంటెలు, అన్నకుట్టి, వగైరా, వగైరా



ప్రతి యింటికి, హోటలుకు కావలసిన పరికరములన్నియు దొరకును.
ఇవి అన్ని వ్యాపారుల దగ్గిర చిక్కును.
మా షో రూమును సందర్శించండి
498, మింట్ స్ట్రీట్, మదరాసు, 3.

మాన్యుఫాక్చరర్లు :

ఇండియన్ మెటలర్జికల్




మెటల్ & కార్పొరేషన్

498, మింట్ స్ట్రీట్ మదరాసు, 3

# మంచి మంచి పుస్తకాలు

మా ప్రచురణలు అన్ని హిగిన్‌బాథమ్సు బుక్ స్టాల్సులోనూ దొరుకుతవి. లేదా మాకు వ్రాయండి. ఒకేసారిగా 6-0-0 పుస్తకాలు తెప్పించినవారికి పోస్టు ఖర్చులు మేమే భరించెదము. లైబ్రరీలకు, పుస్తక వ్యాపారులకు మంచి కమీషను ఇవ్వబడును. వివరాలకు వ్రాయండి.

## శరత్‌బాబు రచనలు

| | | | |
|---|---|---|---|
| వాగ్దత్త | [నవల] | 1 | 12 |
| సుభద | .. | 1 | 8 |
| దేవదాసు | .. | 1 | 8 |
| పల్లీయులు | .. | 1 | 8 |
| నవవిధాన్ | .. | 1 | 0 |
| చంద్రనాథ్ | .. | 1 | 0 |
| పరిణీత | .. | 0 | 12 |
| బడదీదీ | .. | 0 | 12 |
| పతివ్రత | .. | 0 | 12 |
| హేమాంగిని | .. | 0 | 12 |
| నిష్కృతి | .. | 0 | 12 |
| మావారు | .. | 0 | 12 |
| కాశీనాథ్ | .. | 0 | 12 |
| మహేశుడు | [కథలు] | 0 | 12 |
| నారీర్ మూల్య | [వ్యాసం] | 0 | 12 |

## డిటెక్టివు నవలలు

| | | | |
|---|---|---|---|
| కడపటిమాట | [రాధాకృష్ణ] | 0 | 12 |
| మాయమైన మణిహారం | .. | 0 | 12 |
| తప్పిపోయిన పెళ్ళికూతురు | .. | 0 | 12 |
| తగినశాస్తి | .. | 0 | 12 |
| పారిపోయిన యుద్ధఖైదీ | .. | 0 | 12 |
| దివాలా ఎస్టేట్ | .. | 0 | 12 |
| అంతులేని ఆశ | .. | 0 | 12 |

## చక్రపాణి అనువాదాలు

| | | | |
|---|---|---|---|
| నారీద్వేషి | [మైత్రా] అనువాదం కథలు | 1 | 8 |
| పరాజయం | .. .. .. | 0 | 12 |
| ఉదరనిమిత్తం | [నాటకం] | 1 | 0 |
| వల్లభపురం చిట్టడవిలో | [రాయ్‌చౌధరి] | 0 | 12 |
| హనుమంతుని స్వప్నం | [పరశురాం] | 0 | 12 |
| మెట్టవేదాంతం | [వనఫూల్] | 1 | 0 |
| బెంగాలీకథలు | [మనోవైజ్ఞానిక కథలు] | 0 | 12 |
| ప్రగల్భప్రేతము | [అత్యుత్తమ కథలు] | 0 | 12 |
| పాంచజన్యం | [రాజకీయ కథలు] | 0 | 12 |
| డిటెక్టివు | [నాటకం] | 0 | 12 |
| అజకర్ణ | [పరశురాం కథలు] | 1 | 0 |
| సంధి | [యతీంద్ర మోహనసింహా] | 1 | 12 |

## కుటుంబరావు రచనలు

| | | | |
|---|---|---|---|
| విలవనీరు | [అత్యుత్తమ కథలు] | 1 | 8 |
| మొండివాడు | .. | 1 | 0 |
| కాలభైరవుడు | .. | 0 | 12 |
| వరప్రసాదం | .. | 0 | 12 |
| కవిరాట్టు | [గల్పికలు] | 0 | 12 |
| కులంలేని మనిషి | [నవల] | 0 | 12 |
| అరుణోదయం | .. | 1 | 0 |
| మారుపేర్లు | .. | 0 | 12 |
| మీకేం కావాలి? | .. | 0 | 12 |
| ప్రణయరోగులు | [నాటకం] | 1 | 0 |
| అరితేరిన ఘటం | (విదేశ కథలు) | 0 | 12 |
| రష్యన్ కథలు | | 0 | 12 |

## చలంగారి రచనలు:

| | | |
|---|---|---|
| శ్రీ | | 2- 0-0 |
| ప్రేమలేఖలు I | | 1-12-0 |
| ప్రేమలేఖలు II | | 1- 8-0 |
| బిడ్డలశిక్షణ | | 1- 8-0 |
| విషాదం | | 1- 0-0 |
| ఆనందం | | 1- 0-0 |
| చిత్రాంగి | [నాటకం] | 1- 8-0 |
| త్యాగం | ,, | 1- 8-0 |
| మంగమ్మ | ,, | 1- 0-0 |
| జయదేవ | ,, | 1- 0-0 |
| శశాంక | ,, | 1- 0-0 |
| సావిత్రి | ,, | 0-12-0 |
| సత్యం, శివం, సుందరం | | 1- 4-0 |
| నాటికాగుచ్ఛం | | 1- 4-0 |
| కర్మమిట్లా కాలింది | [కథలు] | 1- 8-0 |
| కన్నీటికాలవ | ,, | 0-12-0 |
| పాపం ! ! ! | ,, | 0-12-0 |
| దైవమిచ్చిన భార్య | [నవల] | 1- 8-0 |
| మైదానం | ,, | 1- 0-0 |
| అమీనా | ,, | 1- 0-0 |
| వివాహం | ,, | 1 -0-0 |
| బ్రాహ్మణీకం | ,, | 0-12-0 |
| అరుణ | ,, | 0-12-0 |
| హంపీకన్యలు | ,, | 0-12-0 |
| అదృష్టం | ,, | 1- 0-0 |
| వాళ్ళు నలుగురూ | ,, | 0-12-0 |
| పురూరవ | నాటకం | 1- 8-0 |

## వివిధ రచయితలు

| | | | |
|---|---|---|---|
| ఈస్టలిన్ | [నవల] | | 2- 0-0 |
| చచ్చిపోయిన మనిషి | [పద్మరాజు] | నవల | 0-12-0 |
| కదంబం | [నార్ల] | | 0-12-0 |
| పొగడదండ | [కొ. పద్మావతి] | కథలు | 0-12-0 |
| రూం-టు-లెట్ | [బాలకృష్ణశాస్త్రి] | .. | 0-12-0 |
| సిపాయికథలు | [శిష్ట్లా] | ,, | 0-12-0 |
| మూగజీవాలు | [గోఖలే] | ,, | 1- 4-0 |
| రాజూ-మంత్రీ | [యం. యస్. మూర్తి] | | 0-12-0 |
| చుక్కలూ గీతలూ | .. | ,, | 1- 0-0 |
| హర్ హైనెస్ | | | 1- 0-0 |
| పలితకేశము | [దువ్వూరి] | కావ్యం | 1- 0-0 |
| స్వప్నవాసవదత్తము | [కాటూరి] | నాటకం | 0-12-0 |
| సెలవు | [కప్పగంతుల] | | 1- 0-0 |
| ఋణవిముక్తి | .. | | 1- 0-0 |
| సంజీవి | [ధనికొండ] | కథలు | 1- 0-0 |
| గర్వభంగం | .. | ,, | 1- 0-0 |
| ప్రియురాలు | .. | ,, | 1- 0-0 |
| తీర్పు | ,, | కథలు-నాటిలు | 0-12-0 |
| పవిత్రులు | ,, | దృశ్యనాటిక | 1- 4-0 |
| ఎర్రబుట్టలు | ,, | దృశ్యనాటికలు | 1- 8-0 |
| కళ్యాణి | [సోమంచియజ్ఞన్నశాస్త్రి] | నాటకం | 0-12-0 |
| విశ్వంపెళ్ళి | .. | .. | 0-12-0 |
| జ్యోతిర్మయి | [అ. వెం. నర్సు] | .. | 1- 0-0 |

## యువ బుక్ డిపో

పోస్టు బాక్సు నెం. **1686**, మద్రాసు, 1.

# అట్టమీది బొమ్మ

యశోద కడుపున పుట్టి, దేవకీదేవి ఒడిలో పెరుగుతున్న ఆడశిశువు మామూలు మానవశిశువు కాదు. ఆమె యోగమాయ. అనగా దుర్గాదేవి. విష్ణుమూర్తి ఆజ్ఞ ప్రకారం ఆమె యశోద కడుపున జన్మించింది.

దేవకీ వసుదేవులకు పుట్టిన ఏడుగురు బిడ్డలనూ దయా దాక్షిణ్యమూ లేక, కంసుడు చంపివేసి, ఎనిమిదో బిడ్డ ఎప్పుడు పుడతాడా అని ఆత్రంతో వున్నాడు.

యశోదకు పుట్టిన శిశువును వసుదేవుడు గోకులంనించి తెచ్చి దేవకి పక్కలో వుంచగానే ఆ బిడ్డ కెవ్వున ఏడ్చింది. బిడ్డఏడుపు చెవుల బడగానే కాపాలావాళ్లు పరుగెత్తిపోయి కంసునితో చెప్పారు.

కంసుడు గబగబ చెరసాలలోకి వచ్చి, దేవకి ఒడిలోయున్న బిడ్డను చర్రున లాగుకొన్నాడు. "అన్నయ్యా! మగశిశువు అయితేకదా, నీకు వానివల్ల భయము? ఇది ఆడశిశువాయె. వృథాగా చంపితే నీకు ఏమి కలిసివస్తుంది? నాపయిన దయవుంచి, ఈ బిడ్డనయినా బతకనీ" అని దేవకి అనేకవిధాల బతిమాలింది.

అతను అదేమీ వినిపించుకొనక, ఇదివరకులాగానే ఈ శిశువునుకూడా పైకి ఎత్తి రాతికివేసి కొట్టబోయాడు. కాని, శిశువు అతని చేతులకు దొరకకుండా జారిపోయి, దివ్య తేజస్సుతో ఆకాశమార్గానికి ఎగిరిపోయి, నిజస్వరూపం తాల్చింది.

ఎనిమిది చేతులతో, ప్రతి చేతులలోనూ శంఖం, చక్రం, ధనుస్సు, శూలం మొదలయిన ఎనిమిది ఆయుధాలతో నిజస్వరూపంలో ప్రత్యక్షమయిన ఆ యోగమాయను చూచి అందరూ ఆశ్చర్యపోయారు. పైకి ఎగిరిపోయిన ఆ దేవి కంసునితో—"ఓయి పిచ్చివాడా! నువు చేసిన కట్టుదిట్టములు ఎందుకు పనికి వస్తాయి? నిన్ను చంపటానికి అవతరించే కృష్ణుడు అప్పుడే పుట్టి, వేరొకచోట పెరుగుతూనే వున్నాడుసుమా!" అని అంటూ, అదృశ్యమయిపోయింది!





సంపుటి 4
సంచిక 3

సంచాలకుడు: చక్రపాణి

మార్చి
1949


# శివరాత్రి

పాపాయిలూ! శివరాత్రి శివుడికి యిష్టమైన రోజు. అందుచేత శివాలయంవున్న ప్రతిచోటా ఆనాడు వుత్సవాలుచేస్తారు; ఆ రాత్రి అంతా జాగారం చేస్తారు.

మన దేశంలో మూడు ముఖ్య శివలింగాలు వున్నవి. పడమర శ్రీశైలంలో ఒకటి, తూర్పున శ్రీకాకుళంలో ఒకటి, వుత్తరం ద్రాక్షారామంలో ఒకటి. వీటి మూటినిబట్టే మన దేశానికి త్రిలింగ దేశమనికూడా పేరు వచ్చింది. ఇవికాక ఇంకా కొన్ని ముఖ్యమైన శివక్షేత్రాలు వున్నవి— మహానంది, కాళహస్తి, కోటప్పకొండ, అమరావతి మొదలైనవి. ఇవన్నీకూడా ముఖ్యంగా చూడదగినవి. ప్రతిసంవత్సరమూ మీరు ఏదో ఒక పుణ్యక్షేత్రం దర్శిస్తూవుండండి.




మంగలింటి పిట్టగోడ
మదురు దాపున,
చాలసేపు నుండి రగడ
జరుగుచున్నది.

తిన్నెమీద రోలు నోరు
తెఱచియుండగా,
"పొడుతు"నంటు రోక లెగిరి
పడుతు నున్నది.

రో లు

పోర మొండికట్టె! ఒళ్ళు
పొగరుపట్టెనా ?
మూతి పన్ను విరుగదంతె
మూల బడుదువు.

రో క లి

బండవెధవ! బోసినోరు
పాఱవేయకు,
గుండె లదర బొడిచి పిండి
గొట్టి పంపెద!

రో లు

ఏడ్చినావు నీదు తాత
లెంద ఱెందఱో,
పొడిచి పొడిచి పనికిమాలి
పోయినారయా ?

ఇంతలోనె పొత్ర "మేమి
టేమి?" టంటునె,
దొర్లి దొర్లి రోటిపైకి
దూకుచున్నది.

రో లు

గొంతుకోలు విరుగ కొట్టి
గొట్టుచుండినా
అయిన వారి నెత్తికెక్క
ఆడజూతువా?

రచన : 'ఏటుకూరి'

రోకలి

ఉత్తబండ కేమితెలియు
నోయి? పొత్రమా!
అయినవారె కొంపదీతు
రని యెఱుంగదు.

డోలు

మీరు మా మొగాలలోన
దూరకుండిన
కదలికన్న దుండ దసలు
కలత లుండవు.

రోకలి

మిమ్ము మమ్ము వరుస గలిపి
తుమ్ము లాడక,
గుంజిగొళ్ల కెప్పు డింత
గంజి జాఱునా?

డోలు కింక నోరుకదప
వీలు చిక్కక,
వంకెనున్న ప్రాతడోలు
వంక చూచుచు:

డోలు

వింటివన్న లోకమెంత
వింతయైనదో?
నోరువాయ గొడుతునెట్లు
దూరుచున్నదో!

డోలు

ఒక్కవైపె నిన్ను మోదు
చుండిరన్నయా!
నన్ను రెండుతట్ల బాదు
చున్న దెరుగవా?

ఇంతలోనె వచ్చి పడ్డ
దింటియాబిడ,
ఎక్కడున్న వక్కడే గు
టుక్కుమన్నవి.






పైన కనిపిస్తున్న పన్నెండు బొమ్మలలో రెండు తేడాగా వున్నై.
ఆ రెండూ ఏవో కనుక్కోండి. మీరు కనుక్కోలేక పోతే జవాబుకి
53-వ పేజి చూడండి.




సముద్రం చూచారుకద మీరు!—మన కంటికి కనపడవుగాని, భూమిమీద వున్నట్టే సముద్రం అడుగున కూడా గుట్టలు, మిట్టలు, గుహలు ఎన్నో వున్నయి. ఆ గుహలలో పూర్వం చాలామంది నాగ కన్యలు నివసిస్తూ వుండేవారు. వాళ్ళ తండ్రి సాగరుడు వాళ్లకు అన్ని సౌఖ్యాలూ సమకూర్చేవాడు.

పగడపు తీగెలతో తయారయిన చక్కటి దుస్తులు ధరించి, బంగారపుఛాయతో ఉండే పొడుగుపాటి జుట్టుగల ఆ నాగ కన్యలు ఎంతో అందంగా వుంటారు. వాళ్ళు నివసించే గుహలకు ముత్యాలు, పగడాలు తాపటం చేయటంచేత అవి ధగ ధగ మెరుస్తూ వుంటాయి. అక్కడి నేలంతా మెత్తటి తెల్లని యిసికతో నిండి, పరుపులాగ ఉంటుంది.

ఆ నాగకన్య లందరకూ స్వారి చేయటానికి ముత్యపుచిప్పలతో చేసిన బళ్లు తలకొకటీ ఉంటై. మొఖమల్‌గుడ్డ వంటి మృదువైన నాచుతో దిండ్లూ, బాలీసులూ కుట్టి బళ్లలో అమరుస్తారు. మనం గుర్రాలను కట్టినట్టే వాళ్లు బళ్ళకు బంగారు చేపలను కట్టి తోలుతారు. ఫలానా స్థలానికి వెళ్లాలీ అని నాగకన్యలు మనసులో తలుచుకుంటే చాలు, అవి వారిని అక్కడకు తీసుకుపోతాయి.

సముద్రం అడుగున నాగకన్యలు దాగుడుమూతలు ఆడేవారు, నృత్యం చేసేవారు, చేపలను పట్టేవారు. ఈ పనులతో వాళ్ళకు ప్రొద్దస్తమానమూ ఉబుసుపోయేది.

రాత్రిపడేసరికల్లా బంగారు చేపలు నాగకన్యలను బళ్లెక్కించుకొని సముద్ర

బి. యస్. ప్రసాద్, మద్రాసు

తీరానికి చేరుస్తాయి. మన పిల్లలు గుల్లలు ఏరుకుంటూ, గూళ్లు కట్టుకుంటూ సముద్రపు ఒడ్డున ఇసికలో ఆడుకోరూ!— అలాగే, నాగకన్యలు కూడా రాత్రల్లా అక్కడ సరదాగా ఆడుకునేవారు. ఇక తెల్లవారుతుందనగా, సూర్యుడు ఉదయించక పూర్వమే బంగారుచేపలు బళ్లు తీసుకు వచ్చి, వారిని మళ్లీ గుహలలో దిగబెట్టేసేవి. అందుకనే సూర్యుడి వెలుగు ఎలావుండేదీ నాగకన్యలకు తెలియనే తెలియదు.

ఒకనాడు ఇలాగే ఆడుకోవటానికివచ్చిన నాగకన్యలలో ఒక కన్య పొరపాటున సముద్రతీరాన దిగుబడిపోయింది. ఆమెను తీసుకుపోవటానికి వచ్చే చేపలబండి రాలేదు. పాపం ఆమె దిగులుతో సముద్రం వంక చూస్తూ ఒక గుట్టపైన కూర్చున్నది. ఇంతలో ఆమెకు తూర్పుదిక్కున ఒక వింతవెలుగు కనపడింది.

"ఏమిటది! అబ్బా, ఎంత అందముగా వున్నది! ఇది ఎక్కడినించి వచ్చింది!!" అని ఆదేపనిగా అటు చూడసాగింది. చూడగా చూడగా, ఆకాశం మధ్యని అద్భుతమయిన ఏడు గుర్రాల రథమూ, రథములో ఒక మహారాజు కనపడ్డారు.



అ మహారాజును చూడటంతోనే నాగకన్య తన్మయురాలయింది.

"సముద్రపు అడుగున నివసించడం కంటె, ఈ ఒడ్డున ఇసికలో ఆడుకోవడం కంటే, రథంఎక్కి ఆ మహారాజుతోకూడా తిరిగితే ఎంత బాగుండును" అని మనసులో ఆరాటపడి, అలా కనిపెట్టుకుని వుంటే రాజు తనను చూసి తీసుకుపోతాడనే వుద్దేశంతో, అక్కడగుట్టమీదనే కూర్చుంది.

పగటిపూటంతా ఆమె మహారాజుకోసం కనిపెట్టుకొని వున్నది. ఇంతలో రాత్రివేళ కావటంచేత తక్కిన నాగకన్యలు సముద్రపు ఒడ్డున ఆడుకునేందుకు మళ్లీ బల్లెక్కి వచ్చేశారు. తమతో కలిసి ఆడుకునేందుకు రమ్మని వారు పిలిచినప్పటికి ఆమె గుట్టమీదినుంచి కదలలేదు.

ఆమె ఆరోజు తను చూచిన వింతలన్నీ వాళ్ళతోచెప్పి "ఆ మహారాజు మళ్లీవచ్చే వరకూ నేనిక్కడనే వుండిపోతా" నన్నది.

వాళ్లు ఎంతో చెప్పారు, 'ఆ మహారాజు రాడు ; మనం వెళ్లుదాము ర'మ్మని. కాని ఆమె పోలేదు. అలా పోకుండా నాగకన్య రోజులతరబడి ఆ మహారాజుకోసం కనిపెట్టుకొని, గుట్టమీదనే కూర్చునివుంది.



అయన ప్రతిరోజూ ఆకాశం మధ్యనించి వస్తున్నాడు, వెళుతున్నాడు, కాని గుట్టపైన ఒంటరిగా కూర్చుని తనకోసం తపించి పోతూవున్న ఆ నాగకన్యవేపు ఒక్కసారైనా కన్నెత్తి చూడనేలేదు.

'ఈ గుట్టపయిన కూర్చోవటంవల్ల ఆ మహారాజుకు నేను కనపడకుండా తప్పి పోయినానేమో. పోనీ, మరొకచోటికి పోయి అయనకు చప్పున కనపడేలాగ కూర్చుందా' మని తలిచి అమె అక్కడినించి లేవ బోయింది. కాని, అదేమి చిత్రమో నాగ కన్య కాళ్లు రెండూ భూమిలోకి పాతుకు పోయి ఊడిరాలేదు. క్రమంగా అమెశరీరం ఒక తామరతూడువలె మారి, పచ్చటి అకులు కూడా మొలిచాయి. అమెకున్న బంగారు ఛాయగల జుట్టు ఇప్పుడు బంగారు ఛాయగల రేకులయిపోయి, ఒక చక్కటి పువ్వు ఆకారం ఏర్పడింది.

ఈ పువ్వు మామూలుపూవుల లాంటిది కాదు. చాలా చిత్రమయింది. ఉదయాన మహారాజు తూర్పున బయలుదేరుతాడు గనుక అది తూర్పువేపు తిరిగి "సూర్య మహారాజా! ఇప్పుడయినా నామీద దయ కలగదా? నన్ను నీతో రథంమీద తీసుకు పోవా?" అని బతిమాలుతుంది! అయన వేపే తలయెత్తి చూస్తూ, దీనంగా వేడు కుంటుంది. మధ్యాహ్నమయేసరికి అయన నడినెత్తిన ఉంటాడుగనక పువ్వు కూడా అటే తిరిగి వుంటుంది. సాయం కాల మయేసరికి అయన పడమటికి పోయి అస్తమించుతాడు కదా. అందుచేత సాయంకాలం పడమటికి తిరిగివుంటుంది.

ఈ పువ్వు ఏమిటో మీకు తెలుసునా? ఇదే ప్రొద్దు తిరుగుడు పువ్వు, లేక సూర్య కాంతి పువ్వు. ఈపువ్వు పుట్టుక ఈ నాగ కన్యనించేనని చెప్పుతారు పూర్వులు.






కొంత సేపటికి లక్ష్మమ్మకు మూర్ఛతెలిసి, "నన్నిక్కడ ఎందు కుంచారు?" అని పెద్ద కేక పెట్టింది.

ఈ కేక కావలివాళ్లు విన్నారు. వారికి ధైర్యం కలిగింది. నాగేంద్రుడు వచ్చే గడువు దాటిపోయింది. రాణిగారు బతికిం దన్నారు. తొట్టి కిందికి దించారు. తాళాలు తీసి మూతతీసారు. లోపల నెత్తురుమయం! అందరికీ ఒక్కసారి గుండె ఆగిపోయింది. రాజుగారు బాకుతీసి పొడుచుకుని చావ పోయినాడు. కాని, మంత్రులు ఆయనకు అడ్డుపడి, "ఆగవయ్యా, రాజా! పాము కరిచినవా రంతా చచ్చి పోయారా? మన దగ్గిర మహామంత్రవేత్త లున్నారు. రాణీ గారు తప్పక బతుకుతారు" అన్నారు.

మంత్రగాళ్లు వచ్చి అట్టహాసంగా మంత్రాలు చదవసాగారు.

రాణిగారు కళ్లు తెరిచి రాజును దగ్గిరికి పిలిచింది. ఆయన చెయ్యి పట్టుకుని, "మహారాజా! ఎందుకు వృథాశ్రమ పడు తారు. నాకు చావు సమీపించింది. నేను పోతాను. మీరు మళ్లీ పెళ్లాడనని నాకు ప్రమాణం చెయ్యండి. పాలూ అన్నమూ ముట్టుకుని ప్రమాణం చెయ్యండి. మీరు మళ్లీ పెళ్లాడితే మారుతల్లి నా పిల్లలకు అన్నం పెట్టదు, నీళ్లు పొయ్యదు. కడిపెడు పిల్లల్ని మీకు వప్పగించి పోతున్నాను. మీకు మళ్లీ పెళ్లాడా లనిపిస్తే వాళ్లకు పెళ్లిళ్లుచేసి, అత్తవారిళ్లకుపంపి, ఆతరవాత పెళ్లాడండి" అన్నది.

"నేను అసలు పెళ్లే అడ" నని రాజు ప్రమాణంచేశాడు.

పాపం, లక్ష్మమ్మకు ఆఖరుసారి పిల్లల్ని చూసేభాగ్యం లేకపోయింది. తల్లిని చూచి



దడుసుకుంటారని వాళ్ళను దగ్గిరికి రానివ్వ
లేదు. ఎన్నేళ్లు 'పిల్లలో, పిల్లలో' అని
తపించిన ఆ మహాలక్ష్మమ్మ తల్లి, ఏడు
గురు కూతుళ్లను కని కూడా, వాళ్ళ
అచ్చట్లూ ముచ్చట్లూ చూసుకోకుండా,
వాళ్లనే స్మరిస్తూ ప్రాణం విడిచింది.

లక్ష్మమ్మచావుకు ఊరంతా గొల్లున
ఏడ్చింది. ఆమె శవాన్ని మంచి గంధపు
చెక్కలతో దహనంచేసి రాజు యింటికి
తిరిగి వచ్చాడు. పిల్లలు తల్లిని తలుచుకో
కుండా ఎంతో జాగ్రత్తగా పెంచసాగాడు.



కొంతకాలం గడిచింది. నవాభోజరాజు
తానే తన బిడ్డలకు తండ్రీ, తల్లీ అయి
వాళ్లను సాకుతున్నాడు. పట్నంలో ఉన్న
కాపులూ, కరణాలూ, రాజబంధువులూచేరి
రాజుగారిని మళ్లీ పెళ్లి ఆడమని అడిగారు.
రాజు ఒప్పలేదు. మంత్రులు కూడా చెప్పి
చూశారు. లాభం లేకపోయింది.

చివరకుమంత్రులొక ఉపాయంచేశారు.
ఏడుగురు కూతుళ్ళనూ చాటుగా పిలిచి,
"మేము చెప్పితే మీ నాన్నగారు వినకుండా
ఉన్నారు. ఆయనను మళ్లీ పెళ్లి ఆడమని
మీరు చెప్పండి. మీకు ఆడపనులూ, మగ
పనులూ కూడా మీ నాన్నగా రెన్నాళ్లు
చేస్తారు? పోయిన మీతల్లి తిరిగి రాదుకదా"
అనిచెప్పారు. మంత్రులుచెప్పిన ప్రకారమే
పిల్లలు తండ్రిని పెళ్లాడమని బతిమి
లాడారు. కాని, రాజు ససేమిరా అన్నాడు.

ఇట్లా కాదని అప్పుడు మంత్రు లేంచేశా
రంటే, మనుష్యులను పంపించి మరుల
మాతంగి ఆకులు తెప్పించి, వాటి పసరు
సీకాయలో కలిపి తలంటుకోవడానికి
పనివాళ్ళచేత ఇప్పించారు. దానితో
తలంటుకోగానే రాజు "పెళ్ళో, పెళ్లో" అని
కలవరించసాగాడు. వెంటనే మంత్రులను

పిలిచి "ఎక్కడన్నా ఒక చక్కని చిన్నది ఉంటే చూసి నాకు పెళ్లి చేసెయ్యండి" అని అడిగాడు.

మంత్రులు సంతోషించి, ముగ్గురూ పెళ్లికూతురికోసం ఊళ్లూ ఊళ్ళూ వెతక సాగారు. ఆఖరుకు వాళ్లు నయనవాది పట్నంఏలే ధవళరాజుకొలువుకు వచ్చారు. ఆ రాజుకు మాణిక్యాలదేవి అనే కుమార్తె ఉన్నది. ఆమెకు పెళ్ళి కావలసి ఉన్నది. ఆయన నవాభోజరాజుకు తన కూతురును యిస్తానన్నాడు. మంత్రులు సంబంధం స్థిరపరిచి ముహూర్తం పెట్టివేశారు.

నవాభోజరాజుకూ మాణిక్యాలదేవికీ పెళ్లి జరిగింది. కొత్తభార్యతోసహా రాజు చక్రపట్టణం తిరిగి వచ్చేటప్పుడు అన్నీ అపశకునాలే. వాళ్లు పెళ్ళి చేసుకు వస్తుండగా తీతువుపిట్ట కూసింది. దారిలో ఒక చెట్టుకొమ్మ విరిగి రాజుమీదపడే పర్యంతమైంది. ఆయన చచ్చిపోవలసిందే గాని అదృష్టవశాత్తు తప్పించుకున్నాడు.

అప్పుడు రాజు బ్రాహ్మలయిన తన మంత్రులను పిలిపించి, "మంత్రులారా, నాకు సంబంధం మీరే చూశారు. ముహూర్తం మీరే పెట్టారు. పెళ్లిచేశారు.





ఈ అపశకునాలకు అర్థం కూడా మీరే చెప్పండి" అని అడిగాడు.

మంత్రులు అన్నిటికీ అన్ని సమాధానాలు చెప్పి రాజుగారిని సమాధానపరచాలని ప్రయత్నించారు. కాని, రాజుగారికి తన కొత్తభార్యమీద మనసు విరిగిపోయింది. తన పట్నంచేరుకోగానే ఆమెను వేరే మేడలో ఉంచి తాను పిల్లలతో వెనకటిలాగా ఉండసాగాడు. మాణిక్యాలదేవికి మంగళ సూత్రం తప్ప మరొక నగలేకుండా చేశాడు. ఆమెకు తిండికి కూడా గుప్పెడు గింజ లిప్పించలేదు. మంత్రులు బతిమాలితే రోజుకు మూడుసోలల జొన్నలుమోయిన ఇవ్వమని చీటీ రాసి ఇచ్చాడు.

ఇంతలో ఒకనాడు నవాభోజరాజు జమాబందికి ఢిల్లీ పోవలసి వచ్చింది. పిల్లలను ఒంటిగా విడిచిపోవటం ఇష్టంలేక వారిని కూడా తన వెంట తీసుకుపోయే టందుకు యేర్పాట్లు చేయమని రాజు మంత్రులతో చెప్పాడు.

ఈ సంగతి తెలిసి మాణిక్యాలదేవి రహస్యంగా పిల్లలున్న మేడకువచ్చి, "చూచారా అమ్మాయిలూ! మిమ్మల్ని మీ నాన్న ఢిల్లీ తీసుకుపోతారట. ఆయనతో

వెళ్ళితే మీకు, పాపం, అన్నం ఎవరు పెడతారు? నీళ్లెవరు పోస్తారు? తలలు దువ్వి పువ్వు లెవరు పెడతారు? అందుచేత మీరు వెళ్ళకండి. మీ నాన్నగారు రమ్మంటే రామనిచెప్పండి. 'మాపిన్నిదగ్గిరే ఉంటాం' అని అనండి " అని బోధించింది.

పిల్లలు తండ్రితో ఆ మాటే చెప్పారు. రాజు ఆశ్చర్యపోయినాడు. మారుతల్లిదగ్గిర ఉండడానికి వాళ్ల కభ్యంతరం లేకపోతే నాకుమటుకు దేని కనుకున్నాడు. వాళ్లను మాణిక్యాలదేవి దగ్గిర దిగవిడిచాడు. ఢిల్లీ నుంచి మంచి మంచి బట్టలూ, బొమ్మలూ, తినుబండారాలూ తెచ్చిపెట్టమని పిల్లలు అడిగారు. రాజు సరేనని వెళ్లిపోయినాడు.

మర్నాడు అమావాస్య. మాణిక్యాలదేవి సవితి పిల్లల్ని దగ్గిరికి పిలిచి ఈ విధంగా చెప్పింది :

"అమ్మలూ, ఇవాళ పౌర్ణమి. పగలల్లా పస్తుండి రాత్రికి చంద్రుణ్ణి చూసి భోం చేశారంటే మీకు పున్నమచంద్రులవంటి మొగుళ్ళు దొరుకుతారు " అన్నది.

పిల్లలు ముందు సరేనన్నారు సంతోషంగా. కాని వాళ్ళు రోజల్లా ఉపవాసం ఉండగలరా? అందరికీ ఆకలి దహించుకు



పోసాగింది. వాళ్లు ఆకలికి తాళలేక "పెళ్లిళ్ళు కాకపోతే పీడా పాయె. మా కింత అన్నంపెట్టు " అని మారుతల్లిని బతిమాలారు.

"ఉపోషం ఉంటామని ఎందుకన్నారే, దండుముండల్లారా! మీకోసం నేను అన్నం వండి వార్చి కూర్చున్నానా? " అని మాణిక్యాలదేవి అందర్నీ కసికొద్దీ మొట్టింది.

ఆ పిల్ల లెప్పుడూ మొట్టికాయలు తిన్న వాళ్ళు కారు. వాళ్లకి పట్టరాని దుఃఖం వచ్చేసింది. తండ్రితో ఎందుకు ఢిల్లీ వెళ్లాం కామా అని ఏడిచారు.



"వస్తున్నవాళ్ళు ఊరి కే కూచోరాదు. మీరు తలా ఒక బిందె పట్టుకుని బావికి వెళ్లి నీళ్లు తోడుకురండి" అని మాణిక్యాల దేవి ఏడుగురికీ ఏడు చిల్లిబిందె లిచ్చింది.

పాపం, ఆ పసిపిల్లలు ఎన్నడూ ఏ పనీ చేసినవాళ్లు కాదు. వాళ్ళకి చేదవేసి నీళ్లు తోడటం చాతకాదు. బిందెలు మొయ్యటం అసలే చాతకాదు. కాని, చాతకాదంటే మాణిక్యాలదేవి ఒప్పదు. ఆఖరికి కాసిని మంచినీళ్లయినా ఇవ్వమని పిల్లలు బతిమాలారు. నీళ్ళు తెస్తేకాని దాహ మివ్వ నన్నది మారుతల్లి.

ఇక విధిలేక బిందెలు చంకన పెట్టుకుని ఏడుగురూ బావికి బయలుదేరారు. దారిలో తమ తల్లిని తలుచుకునీ, కష్టాలు తలుచుకునీ పాపం ఏడువసాగారు. ఆ స్థితిలో వాళ్లను చూసి జాలిపడేటందు కెవరున్నారు? వాళ్ళను కన్నతల్లి లక్ష్మమ్మ తప్ప! ఆబిడ్డల వెంట ఎల్లప్పుడూ ఉంటున్న ఆ మహాతల్లి లక్ష్మమ్మ దారిలో అరటిచెట్లు కల్పించింది. ఆ చెట్లపళ్ళు అంది కోసుకుని ఏడుగురూ తిని కాస్త ఆకలి తీర్చుకున్నారు. నూతి దగ్గిర నీళ్ళు తాగి దాహం తీర్చుకున్నారు. బావిలో బిందెలువేసి నీళ్ళు తోడుకుని బుజాల కెత్తుకుని తిరిగివచ్చారు. అవి చిల్లి బిందెలు కనక నీరంతా వారి ఒంటినిండా కారి బట్టలన్నీతడిశాయి. ఇంటికి చేరేవరకు బిందెలో గంటెడునీళ్ళుకూడా మిగలలేదు.

"పిన్నీ, పిన్నీ! ఇవన్నీ చిల్లిబిందె లేమిటి?" అని పిల్లలు అడిగారు.

"తప్పుడు ముండలారా! బిందెలు నూతికేసి కొట్టి చిల్లులుచేస్తారా?" అని మారుతల్లి మూరెడు కఱ్ఱతీసుకుని పిల్లల్ని బాదింది. పిల్లలు ఏడిచిఏడిచి అలిసిపోయి, "మమ్మల్ని దేనికి కొడతావు? నీకు మేమేమి అపచారం చేశాము? మాకు తిండి పెట్టకపోతే మానె, కాస్త దాహమన్నాయివ్వవా?" అనిఅడిగారు.

"ఇస్తాను ఉండండి" అని మాణిక్యాల దేవి లోపలికి వెళ్లి, ఏడు లోటాలలో కొంత జెముడు పాలూ, జిల్లేడుపాలూ పోసుకుని, అందులో నాభి, నల్లమందూ కలిపి తెచ్చి, పిల్లల కిచ్చింది. అవి నిజంగా పాలే అనుకుని పిల్లలు గుటుకూ గుటుకూ తాగేశారు. అందరికీ గుండెలు బరువెక్కాయి. నాలుకలు పీక్కుపో సాగాయి. "అయ్యో, వళ్ళుతిప్పుతోంది. పాలు చేదు విషం" అని ఏడిచారు పిల్లలు.

"మీనాన్నకూ మీకూకూడా నేను విషం కాలేదా ? చావండి" అంటూ మాణిక్యాల దేవి పిల్లల్ని కాలితో తన్ని పడమటింట్లోకి ఈడ్చి తలుపు గడియవేసేసింది.

కొనప్రాణంతో చావటానికి సిద్ధంగా ఉన్న పిల్లలకు ఆ లక్ష్మమ్మ కనిపించి, వాళ్లను చంపేస్తున్న విషం విరుగుడుచేసేసింది.

ప్రొద్దుకూకాక పిల్లలు చచ్చారో లేదో చూదామని మాణిక్యాలదేవి తలుపుతీసి చూసింది. అందరూ బతికేఉన్నారు. "పిన్నీ, చంద్రుడు పొడిచాడా" అని అడిగారు.

"పొడిస్తే నేను తెబుతానులే. మీరు పడుకోండి" అని మాణిక్యాలదేవి మళ్లీ తలుపుమూసి వెళ్లిపోయింది. ఇంత విషం



తినికూడా పిల్లలు చావకపోవటం ఆవిడకు ఆశ్చర్యం వేసింది.

మర్నాడు తెల్లవారుతోంది. పిల్లలు లేచి, "పిన్నీ! పున్నమచంద్రుడేడీ ?" అని అడిగారు. "పున్నమచంద్రుడు పొడవనూ పొడిచాడు, కుంకనూ కుంకాడు" అన్నది మాణిక్యాలదేవి. "అట్లా అయితే మాకు అన్నం పెట్టు" అన్నారు పిల్లలు.

"ఇంతా ఉండి పూర్ణచంద్రుణ్ణి చూడకుండా భోంచేస్తారా? రాత్రిదాకా ఉపోషం ఉండండి. లేకపోతే మీకు ముసలి మొగుళ్లు దొరుకుతారు" అన్నది మారుతల్లి.

పిల్లలు ఆకలికి ఆగలేమంటే ఆగలేమన్నారు. "అట్లా గయితే స్నానాలు చేసి నీళ్ళు తెచ్చుకోండి, భోంచేద్దురుగాని" అన్నది మాణిక్యాలదేవి. "ఇంకా చీకటిగా ఉంది. మేము పోలే"మన్నారు వాళ్లు.

"మిమ్మల్నేమన్నా దయ్యం యెత్తుకుపోతుందా? అంత భయమైతే నేను వెంట వస్తాను పదండి" అని మాణిక్యాలదేవి ఏడుగురినీ వెంటబెట్టుకుని ఊరికి దక్షిణాన అడవిలో ఉన్న పాడుపడిన గుడిదగ్గిరికి తీసుకుపోయింది.

"మీరంతా లోపలికి వెళ్లి, మంచి మొగుళ్ళు దొరకాలని దేముడికి దణ్ణం పెట్టుకురండి" అని పిల్లలను లోపలికి పంపించి, తలుపుమూసి తాళంవేసి, పాపిష్టి మాణిక్యాలదేవి యింటికి తిరిగి పోయింది.

ఆ బిడ్డలు ఆవిధంగా తొమ్మిది రోజుల పాటు అన్నం, నీళ్ళూ లేకుండా ఆ పాడుబడిన గుడిలో అల్లాడి పోయినారు. వాళ్ల అరణ్యరోదన ఎవరు వింటారు? వెరుగులల్లే అయిపోయిన వాళ్ల దేహాలు చూసి ఎవరు జాలిపడతారు? ఆమహాతల్లి లక్ష్మమ్మ తప్ప!

కన్నబిడ్డలు కటకటలాడిపోతుంటే భరించలేక లక్ష్మమ్మ గుడినిండా తేనెపట్టులు చేసింది. కొనప్రాణంతో ఉన్న పసిపాపల నోళ్ళలోకి తేనెధారలు కురవసాగాయి. ఆ తేనెధారలతో వాళ్ల ప్రాణాలు కాస్త తెప్పరిల్లుకున్నాయి. [ఇంకా ఉంది]






గ్రుడ్డివాళ్లు యీవిధంగా చెప్పసాగారు— "ఇటు దక్షిణంగా కొంత దూరం పోతే ఒక పెద్దసరస్సు కనిపిస్తుంది. దానికి కొంచెందూరంలో ఒక మేడలో ముగ్గురు యక్షకన్యలు ఉంటారు. వాళ్లు రాత్రిళ్లు ఇంద్రలోకంనించి వచ్చి, ఆ సరస్సులో స్నానంచేసి, ఆ రాత్రిఅల్లా అక్కడి మేడలో నిద్రపోయి తెల్లవారేలోగా దేవలోకం చేరుకుంటారు. మీరు మూడుతలల రాక్షసుణ్ణి చంపటానికి ముఖ్యంగా మూడు వస్తువులు కావాలి—అవి ఏమిటంటే, ఒక మాయసంచీ, వంకరకత్తీ, మాయకిరీటం. ఇవి మూడూ ఆ యక్షిణుల దగ్గర ఉంటై. ఆ యక్షకన్యలు నిద్రపోబోయేముందు తమ నెత్తిన వున్న కిరీటాలని అక్కడి గోడలకి తగిలించి పడుకొంటారు. ఆ కిరీటాలని తిరిగి తలలకి పెట్టుకొంటేనే గాని వాళ్లు దేవలోకంచేరలేరు. అందుకని, మీరు ఎలాగైనా వాళ్ళ కిరీటాలని కాజేశారంటే, మీకు ఆ మూడు వస్తువులూ యిస్తారు. వాటితో ఆ మూడు తలల రాక్షసుణ్ణి తేలికగా చంపవచ్చును."

"సరే, బాగానేఉంది. మీగుడ్డును మళ్లీ మీకాళ్ళదగ్గిర పెడుతున్నాను తీసుకోండి" అని వృద్ధుడూ, ధీరవర్మడూ గ్రుడ్డుని వాళ్ళ కాళ్ళదగ్గిర పెట్టి ఒక్కసారిగా మళ్లీ గాలిలోకి ఎగిరిపోయారు.

• • •

గ్రుడ్డివాళ్లు చెప్పిన గుర్తులని బట్టి పోగా పోగా ఒక పెద్ద తోటా, అందులో ఒక సరస్సూ, ఆ సరస్సుచుట్టూ చలువరాతితో కట్టబడిన ఒక పెద్ద మేడా కనిపించినై. మేడలో మూడు హంసతూలికా తల్పాల మీద ముగ్గురు యక్ష కన్యలు గాఢనిద్ర

ఒక గ్రీకు కథకు అనుకరణ



పోతున్నారు. అప్పటికప్పుడే తెల్లవారబోతోంది. మరి కొంచెం సేపట్లో వాళ్లు లేచి, మళ్లీ తమతమ కిరీటాలు పెట్టుకుని దేవలోకం చేరుకుంటారు. ఇక అట్టే ఆలస్యం చేస్తే లాభంలేదు. అందుచేత వృద్ధుడు ధీరవర్మణ్ణి త్వరగాపోయి వాళ్ల కిరీటాలు యెత్తుకు రమ్మన్నాడు. ధీరవర్ముడు కూడా అలాగే అడుగులో అడుగు వేసుకుంటూ, ఏమాత్రం శబ్దమూ చెయ్యకుండా యెంతో జాగ్రత్తగా వెళ్లి కిరీటాల్ని ఎత్తుకొచ్చాడు.

అయితే వాళ్లకి కావలసింది ఆ కిరీటాలు కాదుగదా! అందుచేత ఆ మూడు కిరీటాలూ జాగ్రత్తగా తమ దగ్గిర వుంచుకుని, ఆనందంగా పాటలు పాడటం మొదలు పెట్టారు. ఈ గంద్రగోళం చెవిని పడంగానే ఆ యక్ష కన్యలు ముగ్గురూ ఒక్కసారిగా ఉలిక్కిపడి లేచి కూచున్నారు. తమ కిరీటాలకోసం చూసుకున్నారు. కనిపించలేదు. గాభరాగా అటూ యిటూ చూశారు. సరస్సు ఒడ్డున వృద్ధుడూ, ధీరవర్ముడూ ఆడుతూ పాడుతూ





వుండటం వారికి కనిపించింది. వాళ్ల దగ్గిర తమ కిరీటాలు వుండటం చూసేసరికి యక్షకన్యలకు పట్టరాని కోపం వచ్చింది. ఒక్క పరుగున వృద్ధుడూ, ధీరవర్మ్మడూ వున్న చోటికి వచ్చారు. కాని వీళ్లు అంత తేలికగా చిక్కుతారా! వాళ్ళని దాదాపు దగ్గిరికి రానిచ్చి యిద్దరూ ఒక్క సారిగా గాలిలోకి ఎగిరిపోయి, అక్కడినించి, వాళ్ళకి కిరీటాలు చూపించి ఏడిపించటం మొదలు పెట్టారు. యక్షిణులకు యేమి చెయ్యటానికీ తోచలేదు. కిరీటాలు లేనిదే వాళ్లు చెయ్యగలిగింది ఏమీలేదు. అందు చేత 'మా కిరీటాలు మా కివ్వండి.' అని ఎంతో బ్రతిమాలుకోసాగారు.

అప్పుడు వృద్ధుడు యిలా అన్నాడు—"అలాగే యిస్తాను. కాని, వాటికి బదులుగా మీరు మాకు మూడువస్తువులు యివ్వాలి. అవి మీరు యిచ్చేవరకూ మీ కిరీటాలు తిరిగి యివ్వను."

"సరే అలాగే యిస్తాము. అవేవో చెప్పు" అన్నారు ముగ్గురు యక్షిణులూ ఒక్కసారి.

అప్పుడు వృద్ధుడు గ్రుడ్డివాళ్లు చెప్పిన సంచీ, కత్తీ, కిరీటమూ కావాలని కోరాడు.

సరే మొదటి యక్షిణివెళ్లి ఒక సంచీ తెచ్చింది. అది జింకచర్మంతో చెయ్యబడిన



చిన్నమనీపర్సులాంటిది. దానిమీద అక్కడక్కడ బంగారుపూలు కుట్టివున్నై. రెండో యక్షిణివెళ్లి ఒక పొడుగాటి కత్తి తెచ్చి యిచ్చింది. అది తళతళమెరుస్తూ చాల పదునుగా వుంది. మూడో యక్షిణివెళ్లి ఒక ఉక్కు కిరీటం తెచ్చింది. ఈ మూడిటినీ ఒక్కచోటవుంచి, యక్షిణులు వృద్ధుడిని "యిక దిగిరావయ్యా మహానుభావా. నీవు కోరిన మూడువస్తువులూ యివిగో. యివి తీసుకుని మా కిరీటాలు మాకిచ్చి నీదారిని నువ్వు పో" అన్నారు.

సరేనని వృద్ధుడూ, ధీరవర్మ్మడూ ఆ మూడు వస్తువులూతీసుకుని వాళ్ల కిరీటాలు



వాళ్ళకిచ్చి తిరిగి రివ్వున గాలిలో తేలిపో సాగారు.

"బ్రతుకు జీవుడా. మనల్ని యింతటితో వదిలిపెట్టాడుగాని, ఆ కిరీటాలే తీసుకు పోయివుంటే మళ్ళీ మనకు దేవలోక ప్రాప్తి వుండేదే కాదు" అని యక్షిణులు అక్కడ నిలవకుండా తమతమ కిరీటాలు పెట్టుకుని దేవలోకానికి బయలుదేరి పోయారు.

* * *

అప్పటికి బాగా తెల్లవారింది. ధీరవర్ముడూ, వృద్ధుడూ మళ్ళీ భూమిమీదికి దిగి ఒక చోట కాసేపు విశ్రాంతి తీసుకుందామని కూర్చున్నారు. ఇంటిదగ్గిర నుంచి బయలు దేరినతర్వాత ఇంతవరకూ, తిండి అంటూ లేదు గనక ధీరవర్ముడికి తగని ఆకలి వేస్తోంది. చుట్టూ చూశాడు. ఏమీ కనిపించ లేదు. నోరు తెరిచి వృద్ధుణ్ణి అడిగాడు, ఆకలి తీరే మార్గం ఏదైనా చెప్పమని.

ఇది విని, వృద్ధుడు పకపకా నవ్వ సాగాడు. ధీరవర్ముడికి ఎక్కడలేని కోపం వచ్చింది. "నాకు ఆకలి మండిపోతోం దంటే నీకు నవ్వుగా వుందా? రెక్కల చెప్పులు తొడుక్కుని నన్ను మొదట మోస గించి గాలిలో గొప్పగా ఎగిరినట్లుగానే, ఆకలికాకుండా వుండేందుకు నువ్వేమైనా మందు తిన్నావేమో!" అన్నాడు రోషంగా.

"అదిగాదోయ్ పిచ్చినాయనా, ఇంత కష్టపడి మనం సంపాదించిన మూడు వస్తువులూ ఎందుకనుకున్నావ్! వాటిని గురించి అడిగి తెలుసుకోకుండా 'ఆకలో' అని నువ్వు గోలపెట్టేసరికి నాకు నవ్వు వచ్చింది. ఎందుచేతనంటే ఆకలి తీర్చేం దుకే మనం ఆ సంచీ కోరింది. అది మన దగ్గిర వున్నంతకాలం మనకు ఆకలి భయం అక్కర్లేదు" అని చెబుతూ తనదగ్గిరవున్న ఆ సంచిని మూతి విప్పి బోర్లించాడు. సంచీ బోర్లించగానే దాంట్లో నించి రకరకాల పళ్లూ రాసాగినై. "ఇక చాలు, ఈ పూటకి"

అని ధీరవర్మడు అనేవరకూ వృద్ధుడు సంచీ మూతి తెరిచే వుంచాడు. తర్వాత మళ్లీ దానిమూతి బిగించి తన దగ్గిర భద్రంగా దాచివుంచాడు.

సంచీలోంచి వచ్చిన పళ్లూ అవీ కడుపు నిండా తిని ధీరవర్మడు "అమ్మయ్య! ఇక రెండురోజులవరకూ ఏమీ తిండిఅక్కర్లేదు అన్నాడు. తర్వాత వృద్ధుడు, యక్షిణు లిచ్చిన కత్తిని ధీరవర్మడికి ఇచ్చి అంతకు ముందు అతని వద్దవున్న కత్తిని విసిరి పారేశాడు. తర్వాత మాయకిరీటం చూపి, ఈ కిరీటాన్ని నీ నెత్తిన పెడతాను. భలే గమ్మత్తు జరుగుతుంది చూడు" అంటూ ఆ మాయకిరీటాన్ని ధీరవర్మడి నెత్తిన పెట్టాడు. కిరీటం నెత్తిన పెట్టగానే ధీర వర్మడు ఒక్కసారిగా మాయమైనాడు. ఒక్క కిరీటం మాత్రమే వృద్ధుడి పక్కన గాలిలో నిలిచింది.

"ఇప్పుడెక్కడున్నావ్ మనమడా?" అని అడిగాడు వృద్ధుడు.

"ఎక్కడేమిటి! ఎప్పటిలాగా నీ ప్రక్కనే వున్నాను" అని బదులు చెప్పాడు ధీరవర్మడు.

"నేను నీకు ఎప్పటిలాగ కనిపిస్తు న్నానా?" అని అడిగాడు వృద్ధుడు.



"ఆహా, బాగానే కనిపిస్తున్నావు. నేను నీకు కనిపించటంలేదా ఏమిటి?" అని ఆశ్చర్యంగా అడిగాడు ధీరవర్మడు.

"లేదు. నీ తలకు నేనుపెట్టిన కిరీటం మాత్రమే గాలిలో నిలిచి కనిపిస్తోంది. ఇదేవిధంగా ఆ రాక్షసుణ్ణి చంపబోయే టప్పుడు నువ్వు వాడిని చూడగలుగుతావు గాని, నువ్వు ఎక్కడ వున్నావో వాడు కనుక్కోలేడు. మరి చూశావా! యక్షిణులు యిచ్చిన మూడు వస్తువులూ మన కెంత ఉపయోగపడ్డయ్యో" అని చెప్పి మళ్ళీ బయలుదేరారు.

[ఇంకా వుంది]




పూర్వకాలంలో గుడ్లగూబ యిప్పటి మోస్తరుగా వెలుగు చూచి భయపడేది కాదు. అదీ తక్కిన పక్షులన్నిటితో పాటు పగటిపూట ఆహారంకోసం తిరిగి, రాత్రి వచ్చి గూడు చేరుకొనేది. అయితే, ఈనాడు అది పగలల్లా దాగుకొని, దొంగలాగ రాత్రి పూట యెందుకు సంచారం చేస్తుందీ అని అడుగుతారేమో? గుడ్లగూబ ఇలా చేయడానికి, చాలా చిత్రమయిన కథ ఒకటి వున్నది. చెబుతా వినండి:

ఒకనాడు మామూలుగా గుడ్లగూబ, పగటిపూట ఆహారాన్ని వెదకుకొంటూ అడవులవెంట బయలుదేరింది. అది ఒక చెట్టు కొమ్మపైన కూర్చునివుండగా, వేటగాడొకడు విల్లు ఎక్కుపెట్టి దానిని కొట్టాడు. కాస్తంతలో గురితప్పిపోవటంచేత, గుడ్లగూబ కొనప్రాణాలతో ఒక తుప్పలో పడి చిక్కుకున్నది. వేటకాడు వెతికి వెతికి విసిగిపోయి, గూబ కనపడకపోవటంచేత తనదారిని తను పోయాడు.

తుప్పలో చిక్కుకొన్న గుడ్లగూబ బాధ చేత లేవలేక, అక్కడనే దీనంగా అరుస్తూ వుంది. ఈ అరుపు విన్న కాకమ్మ, గూబను చూచి జాలిపడింది. 'కష్టాలు ఎవరికయినా వస్తాయి, ఇటువంటప్పుడు సాయపడితేనే నిజమైన సాయం' అనుకుని, దానిని తమ యింటి వైద్యుడయిన కోకిలడాక్టరు వద్దకు తీసుకువెళ్లి, వారి ఆసుపత్రిలోచేర్పించింది.

గుడ్లగూబ పీనాసి అనేసంగతి కోకిల డాక్టరుకు ఇదివరకే తెలుసు. పీనాసిగా ఉండేవాళ్ళు సమయం చిక్కినప్పుడు దగాచేయటానికయినా జంకరు. ఇటువంటి వాళ్లను డాక్టరు రోజూ ఎంతోమందిని చూస్తూవున్నాడు.

అందుచేత ఇప్పుడు, తనకు స్నేహితురాలైన కాకమ్మ, వైద్యంకోసం గుడ్లగూబను


జి. శ్రీరామమూర్తి, గుంటూరు — గాదె నాగభూషణం, ఏలూరు

తీసుకురాగానే "కాకమ్మా! నువ్వు జాలి గుండె కలదానివి. నల్లనివన్నీ నీళ్లూ, తెల్లని వన్నీ పాలే అనుకుంటున్నావు కాని, లోకంలో ఎవరి నైజం ఎటువంటిదో తెలుసుకోలేవు. గూబసంగతి నీకు తెలియదు కాని, నేను బాగా ఎరుగుదును. దానిపైన జాలిపడటంకాని, దానిని చేరదీయటంగాని మంచిదికాదు, తరువాత నీ యిష్టం" అని కోకిలడాక్టరు సలహా యిచ్చాడు.

కాని, ఏమైనాసరే కాకమ్మకు మాత్రం, మాట తిరగటం యిష్టంలేకపోయింది. "అయ్యా, డాక్టరుగారూ! తెలిసో తెలియకో నేను బాగుచేయిస్తానని చెప్పి దానిని రమ్మన్నాను. మధ్యలో విడిచిపెట్టడం ధర్మంకాదు. గూబవల్ల యే కష్టంవచ్చినా, నష్టం వచ్చినా నాదేబాధ్యత. మీరు సంశయించక దాని ఒళ్ళు నయంచేయండి" అని కాకమ్మకోరింది.

కాకమ్మ మాటనమ్మకంమీద కోకిల డాక్టరు గూబకు చికిత్స ప్రారంభించాడు. దేవుడి దయవల్లా, డాక్టరుచేతి చలవవల్లా గుడ్లగూబకు త్వరలోనే వళ్లునిమ్మళించింది.

డాక్టరుగారు యింక కట్నం అడుగుతారనే సమయానికి గూబకు దుర్బుద్ధి



పుట్టి, ఎవరికితెలియకుండా రాత్రికిరాత్రి అడవులలోకి పారిపోయింది. తెల్లవారేసరికి ఏముందీ?- గూబ పడుకునే మంచం ఖాళీ!

డాక్టరుగారు కాకమ్మకు కబురుచేశారు. గూబచేసినమోసం తెలియగానే కాకమ్మ తెల్లబోయింది. 'డాక్టరుగారు ముందుగానే చెప్పారు, వారి మాట వినకపోతినే' అని విచారించింది. 'అబ్బా! పైకి మంచిగానే కనబడుతూ, లోకంలో ఇంత ద్రోహంచేసే వాళ్ళు ఉన్నారా' అని అమాయకురాలు కాకమ్మ ఆశ్చర్యపోయింది.

"డాక్టరుగారూ! అయిందేదో అయింది. ఈవిధంగా మీకు శ్రమ కలిగించినందుకు చాలానొచ్చుకొంటున్నాను. గూబకు వైద్యం చేసినందుకు యెంతఅయిందో చెప్పండి. ఆసొమ్ము నేనే ఇచ్చుకొంటాను" అన్నది.

అప్పుడు కోకిలడాక్టరుగారు ఈ సంగతు లన్నీ తన భార్యతో ఆలోచించి వచ్చి, "కాకమ్మా! ఉపకారానికి పోతే అపకారం ఎదురయింది కాని, యిందులో పాపం, నువ్వు తిన్నదీ కుడిచినదీ ఏమైనా ఉన్నది గనకనా? ఎవళ్లనుపడితే వాళ్లను నమ్మే స్తావు. నువు వెర్రిబాగులదానివని తెలిసే నేను ముందుగా చెప్పాను కూడాను. సరేలే. ముందయినా జాగ్రత్తగా ఉండు. ఇప్పుడు—మాట తిరిగిపోలేక కదా, గూబ చెల్లించవలసిన సొమ్ము నీవే యిచ్చు తుంటా నంటున్నావు. ఇంతకాలమై మనం స్నేహంగా ఉంటూ, వస్తున్నదికదా అని డబ్బు గుంజుకోవటానికి నేను ఒప్పను. అయితే ఒక్క విషయం: గూబ చేసిన ద్రోహం ప్రపంచం ఉన్నంతకాలమూ ప్రజలు చెప్పుకోవాలి. అందుకని నేనూ, నా భార్య ఒక యేర్పాటు ఆలోచించాము. ఆమె తనగ్రుడ్లను నీగూటిలో పెడుతుంది. నీవు వాటిని పొదిగి పిల్లలను చేయాలి. ఈ వింతఏమిటీ? అని లోకులు తెలుసుకో బోయినప్పుడల్లా, నీకూ నాకూకూడా గూబ చేసిన ద్రోహం జ్ఞాపకం వచ్చి, కథగా చెప్పుతుంటారు" అని కోకిల డాక్టరు చెప్పే సరికి, కాకమ్మ సంతోషంతో ఈ ఏర్పాటుకు వప్పుకొంది.

నాటినించీ నేటివరకూ పగటిపూట తల ఎత్తుకు తిరగాలంటే గుడ్లగూబకు భయమే. పొరబాటున అది దారితప్పి బయట పడిందో, కసిపూనిన కాకమ్మ దానిని పొడిచి పొడిచి తరుముతుంది.





# అనుమానం

అనగనగా ఒక పట్టణంలో ఒక రాజు ఉండేవాడు. ఆయనకు అ ను మా న ం ఎక్కువ. ఆ అనుమానమే ప్రతివిషయం లోనూ ఆయనకు ప్రాణంమీదికి తెచ్చేది.

ఆ ఊళ్లోనే రామయ్య అనే మోసగాడు కూడా ఉన్నాడు. అతనికి జ్యోతిషం ఏమీ తెలియకపోయినప్పటికీ, యుక్తివల్లా, తెలివి తేటలవల్లా తనొక గొప్ప జ్యోతిష్కుడ నని లోకాన్ని న మ్మి ం చ గ లి గా డు. అతనికి కొంచెం పేరు రాగానే రాజుగారు అతనిని తమ అస్థానంలో జ్యోతిష పండితునిగా పెట్టుకొన్నారు.

ఒకప్పుడు రాజ్యంలో కాటకం పట్టింది. రామయ్యను పి లి పి ం చి "దీని కేమిటి సాధనం ?" అని రాజుగారు అడిగారు.

అందుకు రామయ్య "ప్రభూ! కాటకం మాట కేమి గాని, ఏలినవారి జాతకచక్రం చూడగా ప ర రా జు ఎవరో త్వరలోనే మనపైకి దండెత్తి వచ్చేటట్టున్నది" అని అంటూ, సంశయంతో ఊరుకున్నాడు.

అతను సందేహించటం చూచేసరికి రాజుగారి అనుమానం ఎక్కువయింది. ఆయన రామయ్యను విషయం అంతా వివరంగా చెప్పమని తొందరపెట్టసాగారు.

అప్పుడు రామయ్య "ఇంకేముంది, మహా రాజా! రాజ్యపతనంతరవాత అరణ్యవాసం కూడా జాతకంలో రాసివున్నది. ఏమిటా ఈకర్మం అని ఆలోచిస్తున్నాను" అని నీళ్లునములుతూ చెప్పాడు.

ఇది విని రాజుగారు మంచం పట్టారు. ఈ గుట్టులన్నీ తెలుసుకొన్న పరాయిరాజు నిజంగానే దండెత్తి వచ్చాడు. "ఇప్పుడు చేయవలసినది ఏమిటి?" అని రామయ్యను రాజుఅడిగాడు. "ఏమున్నదిప్రభూ! జాతక రీత్యా అడవిపాలు కావలసిన యో గ ం ఉండనే ఉన్నది కాబట్టి, ఆ ప్రయత్నం

మద్దాళి సుశీలాదేవి - బాపట్ల



చేయడమే క్షేమం" అంటూ రామయ్యా చెప్పాడు. అతను పోసిన పిరికిమందు తలకు యెక్కడంవల్ల మన రాజుగారు అడవికి పోయే ఏర్పాటు చేసికొన్నారు. అప్పుడు పరాయిరాజు సులువుగా ఈ రాజ్యం ఆక్రమించుకొన్నాడు.

మన రాజుగారు రాజ్యంవదిలి అడవులు పట్టి వెళ్లిపోయారే కాని, రామయ్యామట్టుకి పట్టణం వొదిలిపోలేదు. అతను క్రొత్తరాజు అనుగ్రహాన్ని సంపాయించి, ఆయన కొలువులో జ్యోతిషపండితునిగా కుదిరాడు.

కాని, రామయ్యా అంతటితో వూరుకోలేదు. పాతరాజును చంపించాలనే దుర్బుద్ధి అతనికి కలిగింది. "పాతరాజు బ్రతికి వున్నంతవరకు మీకు సుఖంలే"దని కొత్తరాజుతో కొండెములు చెప్పాడు. కొత్తరాజు అతనిని చంపినవారికి వెయ్యి రూపాయలు బహుమానం యిస్తానన్నాడు. రామయ్యాకు ఈ డబ్బుకూడా తనే కాజెయ్యాలని దురాశ పుట్టింది.

కొత్తరాజుదగ్గర శలవుతీసుకొని ఎలాగో శ్రమపడి రామయ్యా పాతరాజుగారుండే జాగా చేరుకొని, వారి పరిస్థితులకు ఎంతో విచారపడుతున్నట్టు నటించాడు.

ఆతరవాత రామయ్యా కొంతసేపటికి, తనను కొత్తరాజు పట్టణంనుంచి వెళ్లగొట్టాడంటూ చెప్పుకొని యేడిచాడు. అమాయకుడైనరాజు అతని మాటలువిని జాలిపడ్డాడు.

రాజుగారికి తనమీద నమ్మకం కలిగేటందుకని, రామయ్యా ఇక్కడనే వారితో పాటు అడవిలో ఉండిపోయాడు. ఒకనాడు రాజు రామయ్యాను వెంటబెట్టుకొని షికారువెళ్లాడు.

దోవలో రాజుగారికి దాహమయింది. రామయ్యా ఒక బొక్కెనలో నీళ్లు తోడుకువచ్చి ఆయన కిచ్చాడు. రాజు నోటిదగ్గర

పెట్టుకొని తాగుతూవుండగా చెట్టుకొమ్మపైన కూర్చునివున్న ఒక ఉడత ప్రతిబింబం ఆ నీళ్లలో కనపడింది. 'అయ్యో! నీళ్లతోపాటు ఉడతనుకూడా మింగివేశాను కాబోలు'నని రాజుకు కంగారు పుట్టింది.

ఈ సంగతి ఆయన రామయ్యతో చెప్పేసరికి, "అవునండి ప్రభూ! అదేదో నీళ్లలో అడ్డుపడటం నేనూ చూశాను. అది తప్పక ఉడతే అయివుండాలి. లేకపోతే, ఇంతవరకూ కొమ్మపైన కూర్చున్న ఉడత కనపడకపోవట మేమిటి?" అని అతను అనగానే రాజుగారికి అనుమానం మరీ ఎక్కువైపోయింది. ఇది కారణంగా ఆయనకు భరించలేని కడుపునొప్పి ప్రారంభమైంది. రామయ్యచేసిన కపటనాటకమంతా మంత్రి కనిపెడుతూనే వున్నాడు.

పేరొందిన వైద్యులువచ్చి, రాజుగారికి వమనం కావటానికి మందిచ్చారు. కళ్లు మూసుకొని ఆయన కక్కుకొంటున్న సమయంలో మంత్రి చేసిన ఏర్పాటు ప్రకారం ఒక ఉడత కిందపడింది. దానిని కంటితో చూడగానే రాజుగారికి కడుపునొప్పి, దానితో తక్కిన అన్నిబాధలూ పోయినాయి. ఆయనకు వంట్లోనూ మనసులోనూ తేలికగా ఉన్నట్టనిపించింది.




అప్పుడు మొదటినించీ రామయ్యచేసిన మోసాలన్నీ పూసగుచ్చినట్టుగా రాజుకి మంత్రిచెప్పాడు. ఈ అవకతవకజ్యోతిష్కుణ్ణి పెట్టుకొన్నందువల్లనేకదా రాజ్యం పోయిందని రాజు అనేకవిధాల చింతించాడు.

మంత్రి తెలివితేటలవల్ల కొత్తరాజుతో సంధిజరిగి మన రాజుగారికి మళ్లీ రాజ్యం వచ్చేసింది. కపటి అయిన రామయ్యను బతికి ఉన్నంతవరకూ ఖయిదులో పెట్టి వుంచారు. నాటినుంచీ మన రాజుగారు మరెన్నడూ జ్యోతిషం నమ్మనూలేదు, అనుమానాలకు తావివ్వనూలేదు.




ఒక రైతుకు ముగ్గురు కుమార్తె లుండే వారు. అందులో చిన్నది అందమైనది. ఆమె పేరు సుందరి. రూపంలోనే గాక గుణాలకుకూడా ఆమె సుందరే. పెద్దవాళ్లు యిద్దరి మనస్సూ మంచిదికాదు. వాళ్లు పనిపాటలన్నీ సుందరిమీదికే తోసివేసి, పైగా ఆమె చేసేదానిలో లోపాలుఎంచుతూ వుండేవాళ్లు. అంతేకాదు; అమాయకురాలైన సుందరిని పిచ్చిపిల్లఅని పిలిచేవాళ్లు. ఏమన్నప్పటికీ, సుందరి ఓర్చుకొని వుండేది.

ఒకరోజున తండ్రి సంతకు పోతూ, కూతుళ్ళను పిలిచి, ఎవరికేం తెచ్చిపెట్టమంటారని పేరు పేరునా అడిగాడు.

పెద్దకూతురు విలవయిన మణిహారం కావాలన్నది. రెండవ కూతురు చక్కటి జరీచీర కావాలన్నది. "వీలునుబట్టి నాకు వెండి పళ్లెమూ, గాజురేగుపండూ తెచ్చి పెట్టండి" అని సుందరి అన్నది.

తండ్రి వెళ్లింది మొదలుకుని ఎప్పుడు తిరిగి వస్తాడా అని అక్కలిద్దరూ ఆత్రపడి పోయారు. సుందరి మామూలుగా యింటి పనులు చూసుకొంటూ, తల్లిని కనిపెట్టుకొని వున్నది. ఒకవారంరోజులకల్లా తండ్రి తిరిగి వచ్చాడు. అతను వచ్చినట్టు వీధిలో అలికిడి కాగానే అక్క లిద్దరూ తండ్రిని చుట్టేశారు. సుందరి మాత్రం తండ్రి దుస్తులు అందుకొని, మంచినీళ్లిచ్చి అతని కేమసమాచారాలు కనుక్కొన్నది.

"తల్లీ! నీవు కోరిన వస్తువులకోసం చాలా తిరగవలసి వచ్చింది. ఐతే ఏమిలే, దొరికాయి. అదేసంతోషం" అని సుందరితో తండ్రి చెప్పాడు. "అయ్యో! నాన్నకు శ్రమ యిచ్చానుకదా" అని ఆమె విచారించింది. "అయితే, వీటితో యేం చేస్తావమ్మా ?" అని తండ్రి అడిగాడు. "రేగుపండును పళ్లెంలో నూరతాను" అని సుందరి చెప్పే

ఆర్. రామమూర్తి, గుంటూరు



సరికి, "పిచ్చిపిల్లా! ఇదేమి ఆట!!" అని అతను నవ్వాడు.

పెద్దామె మణిహారం వేసుకొన్నది. రెండవ ఆమె జరీచీర కట్టుకొన్నది. అవి చూచుకొని వాళ్లు మురిసిపోయారు. సుందరి వెండిపళ్లెంలో గాజురేగుపండు పెట్టి చిరునవ్వుతో అదేపనిగా మూరుతున్నది.

కొంతసేపటికి సుందరికి పళ్లెంలో ప్రపంచమంతా కళ్ళకు కట్టినట్టు కనపడింది!— సింహాసనంమీద కూర్చున్న రాజు, సముద్రం మీద పోయే ఓడలు, పట్టణంలో మేడలు— ఒకటేమిటి, అన్నీ స్పష్టంగా అగపడుతున్నాయి. వీటిని చూడటం ఒక ఆటగా పెట్టుకొని, సుందరి ఆశ్చర్యపోయి, ఆనందించేది.

సుందరి యిలా సరదాగా వుండటం చూచి, అక్కలిద్దరూ ఓర్వలేకపోయారు. ఆ పళ్లెమూ, పండూ ఎలాగయినా కాజేదామని వాళ్లకి దుర్బుద్ధి పుట్టింది. పెద్దక్క తన మణిహారానికిబదులు వాటినిమ్మనిఅడిగింది. చిన్నక్క తన జరీచీరకు బదులు వాటినిమ్మని అడిగింది. సుందరి ఇద్దరికీ ఇవ్వనన్నది. అసూయకు తోడు అక్కలిద్దరకూ ఇప్పుడు సుందరిమీద కోపంకూడా రేగింది.

'ఇక మెల్లిగాఅడిగి లాభంలేదు. ఆమెను చంపివేసినట్టయితే ఆ వస్తువులు మనం సులువుగా చిక్కించుకోవచ్చు'అని అక్కలిద్దరూ ఆలోచించుకొని కుట్ర పన్నారు.

మరునాడు వాళ్లు సుందరిని పిలిచి "చెల్లీ! మేం పళ్ళు కోసుకురావటానికి తోటకు పోతున్నాము. అన్నీ మోయటం యిద్దరివల్ల కాదుకదా! నువ్వురా"అని పిలిచారు. సరేనని, ముగ్గురితట్టలూ తనే చేతపట్టుకుని, సుందరికూడా బయలుదేరింది. బయలుదేరే ముందు. ఆమె తన ఆటవస్తువులు రెండూ దాచమని తండ్రి కిచ్చింది.



పోయి పోయి వాళ్ళు ఒక అడవి చేరు కున్నారు. కొంచెంసేపు పళ్ళు ఏరినట్టేఏరి. అక్కలిద్దరూ సుందరిని తన ఆటవస్తువులు రెండూ ఇమ్మన్నారు. అమె తన దగ్గిర లేవంది. ఈమాట నమ్మక, సుందరి అబద్ధ మాడుతున్నదని చెప్పి, వాళ్ళు రహస్యంగా తెచ్చిన గొడ్డలితో ఆమె పీక తెగవేశారు. కాని వాళ్లకు పళ్ళెమూ పండూ దొరకనే లేదు. ఇక చేసేదేమున్నది!— దుఃఖం నటిస్తూ యింటికి చేరుకొని, "అడివిలో తోడేళ్ళు కూశాయి. చెల్లిని అవి వేసుకు పోయినాయో యేమో. యెంత వెతికినా మాకు కనపడలేదు" అని చెప్పేసరికి, తలి దండ్రులు వల వల ఏడిచారు.

కొంతకాలానికి ఒక గొల్లపిల్లవాడు తప్పి పోయిన గొర్రెలను వెతుక్కొంటూ అడవిలో తిరుగుతున్నాడు. ఒక పొదలో వాడి కొక చిత్రమయిన చెట్టుకనపడింది. చూపుకి అది బోలుగొట్టంలాగ వుంది. ఆ చెట్టుకి అందమైన నీలిరంగు పువ్వులు, ఎర్రటి కాయలూ కాసి వున్నాయి. గొల్లపిల్లవాడు దానిని కోసి, గొట్టానికి పీపీ పెట్టి, వూదుదా మనుకొంటున్నాడు. అదిఅతని పెదవులకు తగిలేసరికే ఇలా పాడటం మొదలెట్టింది:

వూదూ బూరా, వూదూ బూరా,
తల్లికి తండ్రికి జయం, జయం!
పెద్దక్కా చిన్నక్కా కలిసీ
పండ్లు కోసుకొందామని పిలిచీ
పళ్లెం పండూ కాజేదామని
నరికారయ్యా, నట్టడవిలో!

ఈ వింతబూరా పట్టుకొని గొల్ల పిల్ల వాడు ఊళ్లోకి పరుగెత్తాడు. అందరూ గుమి గూడి ఆశ్చర్యంతో పాట వింటున్నారు. విన్నవాళ్ళంతాకూడా "అయ్యోపాపం!— ఎవళ్ళమ్మా ఆ చంపేసిన దుర్మార్గులు!!" అని జాలిపడ్డారు.

చివరకు ఈ వార్త రైతుకు తెలిసింది. అతను పాట విని, కళ్ల వెంట బొట బొట నీళ్లు రాల్చాడు. ఈ గొట్టం దొరికిన స్థలానికి తీసుకు వెళ్ళమని గొల్లపిల్లవాడిని బ్రతిమాలాడు. ఇద్దరూ కలిసి అడివిలోకి వెళ్లేసరికి, అక్కడ గొల్లవాడు గొట్టంకోసిన చెట్టుమొదలు యింకా పాడుతునే వుంది!

రైతు ఆ మోడు తవ్వి చూచేసరికి, తన మూడవ కూతురు సుందరి నిద్రపోతున్నట్టుగా పడుకొని వున్నది. అతను వెక్కి వెక్కి ఏడిచాడు. చెట్టు మొదలు ఈ సారి పాటమార్చి, ఇలా పాడింది:—

"పెద్దక్కా చిన్నక్కా కలిసీ
పళ్లు కోసుకొందామని పిలిచీ
పళ్లెం పండూ కాజేదామని
నరికారయ్యా నట్టడవిలో
నాన్నా నాన్నా నాన్నా నాన్నా
రాజాగారి బావిలో జలమూ
పట్టుకవచ్చి చల్లితివంటే
నే లేస్తానూ, తెలివొస్తుందీ!"

ఈపాట వినేసరికి, లోకమంతా అక్కలిద్దరనూ తిట్టిపోశారు.

గొల్లపిల్లవాడిని అక్కడే కాపలావుంచి, తండ్రి తక్షణమే రాజుగారిదగ్గరకు వెళ్లి,



సంగతి సందర్భాలన్నీ వారికి విన్నవించాడు. దానికి రాజుగారు "సరే, మా బావిలో నీళ్లు పట్టుకువెళ్లు, నీ కూతురు బతికి లేవగానే మాకు చూపించు" మని ఆజ్ఞాపించారు.

సంతోషంతో నీళ్లు తీసుకొని, అతను అడవిలోకి పోయి, కూతురు శరీరంపైన చల్లాడు. ఆమట్టున సుందరి, నిద్రనించి లేచినట్టుగా కన్నులు నులుముకొంటూ, లేచి కూర్చున్నది. తండ్రిని చూడగానే ఒక్కసారి బావురుమని, అతని మెడ చుట్టేసుకొన్నది. ఇదంతా చూస్తూవున్న

గొల్లపిల్లవానికి కూడా ఆనందబాష్పాలు రాలినయి.

వెంటనే సుందరిని వెంటబెట్టుకొని తండ్రి రాజు దర్శనానికి వెళ్లాడు. రైతునీ, ముగ్గురు కూతుళ్లనూ రాజు చూచాడు. "ఇటువంటి దుర్మార్గులు మళ్లీ సూర్యోదయం చూడడానికి వీలులేదు. ఇవాళనే సూర్యుడు అస్తమించేలోపల వీళ్లిద్దరి తలలు తీయించ"మని శిక్ష విధించారు.

తరువాత సుందరిని పిలిచి "నీవు ఆడుకొనే వెండి పళ్లెమూ, గాజురేగుపండూ చూపించు"మన్నారు. తండ్రివద్దనే ఉన్న ఆటవస్తువులు రెండూ పెట్టెలోనుంచి తీసి కూతురి కియ్యగా, ఆమె వాటిని రాజుగారికి బహుమతి చేసింది. రాజుకు ఆ పళ్లెంలో కని విని ఎరుగని వింత లెన్నో కనపడ్డాయి.

అంతట, కూతుళ్ళతోసహా రైతు ఇక యింటికి వెళదామని రాజుగారివద్ద సెలవు తీసుకొనబోయాడు.

అప్పుడు రాజుగారు సుందరితో "నువ్వు ఆడుకొనే వెండిపళ్లెమూ, గాజురేగుపండూ రాజులవద్ద ఉంతవలసిన వస్తువులు. నీవు కోటలో రాణిగా ఉండవలసినదానివి" అని అనేసరికి, సుందరి సిగ్గుతో తలవంచుకొన్నది. "అయితే, నాకొక్క కోరికవున్నది. మా అక్క లిద్దరకూ శిక్ష తప్పించండి. వాళ్ళు పోతే నేను బతికిన సార్థకమేమిటి" అని ఆమె అన్నది. ఆమె ఔదార్యానికి మెచ్చుకొని, రాజు శిక్ష రద్దుచేయించాడు.

మంచి ముహూర్తాన రాజుకీ సుందరికీ అతివైభవంగా పెళ్లి జరిగింది. అందరూ సంతోషించారు. నాటినించీ రైతు, అతని కుటుంబం అంతా కోటలోనే ఉంటున్నారు. వీరందరూ హాయిగా వుండడం గొల్లపిల్లవాని సాయంవల్ల కదా! అందుచేత సుందరి ఆ గొల్లవానిని జన్మలో ఎప్పుడూ మరిచిపోలేదు. అతనికి అనేకమైన కానుక లిచ్చి, తన ఋణం తీర్చుకొన్నది.





# బ్రహ్మరాత

అనగనగా ఓ రాజూ రాణీ ఉండేవారు. వారికి ఒక్కగాని ఒక్క కూతురు. ఆ పిల్ల పేరు సుశీల. ఆమెను ఎంతో గారాబంగా పెంచారు. పెంచితే సరా? మంచి మొగుణ్ణి చూసి పెళ్ళి చెయ్యవద్దూ! అక్కడే వచ్చింది పేచీ భార్యా భర్తలకు.

"మా అక్కకొడుకున్నాడుగదా, అతగాడి కిచ్చి పెళ్ళిచేద్దాం సుశీలని" అన్నాడు రాజు. రాణి అందుకు ఒప్పుకోలేదు. "అమ్మాయి పుట్టినప్పట్నుంచీ దాన్ని మా అన్నయ్యగారబ్బాయికిచ్చి పెళ్ళిచేద్దా మనుకున్నాను. ఇప్పుడు మీ రిలా అంటే ఎలా కుదురుతుంది?" అంది.

పెళ్ళి విషయంలో రాజూ, రాణీ ఇలా రోజూ తగాయిదా పడుతుండేవారు. ఆఖరికి ఒకనాడు రాజు, 'నేను రాజును! నాకు ఎవరూ ఎదురుచెప్పడానికి వీల్లేదు. నా కూతురుని నా యిష్టం వచ్చినవాడి కిచ్చి పెళ్ళిచేస్తాను' అని కోపంగా చెప్పేసి, ఆ రాత్రే తన మేనల్లుణ్ణి రప్పించి, ఓ మేడలో దాచి ఉంచాడు. పురోహితుణ్ణి పిలిపించి, పెళ్ళి ముహూర్తం పెట్టించాడు.

రాణి మాత్రం ఊరుకుందా? లేదు. 'కష్టపడి కని, పెంచి పెద్దదాన్ని చేశాను గదా పిల్లని? నా యిష్టంవచ్చిన వాడి కిచ్చి పెళ్ళిచెయ్యక ఎవడికో యిచ్చి చేస్తానంటే నేను ఒప్పుకుంటానా?' అని లోలోపలే కోపగించుకుని, తన అన్నగారికుమారుణ్ణి ఓ రాత్రివేళ ఎవరికీతెలియకుండా తీసుకొచ్చి, మరో మేడలో రహస్యంగా దాచిఉంచింది.

పెళ్ళికొడుకు లిద్దరూ చెరో మేడలోనూ ఉండి, 'సుశీల నా పెళ్ళాం ఔతుందంటే నా పెళ్ళాం ఔతుంద'ని లొట్టలు వేసుకుంటూ లగ్నానికి యెదురుచూస్తున్నారు.

పాలంకి వెంకట రామచంద్రమూర్తి.



వాళ్లు అలా ఉండగా బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుడు ముగ్గురూ కలిసి, భూలోకంలో జరిగే చిత్రాలు చూడ్డానికని ఆకాశంమీద షికారుగా బయల్దేరి, ఆపట్టణం మీదినించి వెడుతున్నారు. అప్పుడా యిద్దరు పెళ్లికొడుకులసంగతీ వాళ్లకి తెలిసి, ఈశ్వరుడు బ్రహ్మదేవుడికేసి చూసి, "ఏమయ్యా! బ్రహ్మా! ఆఖరికి ఈపెళ్లికొడుకు లిద్దరిలోనూ ఈ పిల్ల ఎవణ్ణి పెళ్లిచేసుకుంటుంది?" అని అడిగాడు. ఈ భూలోకంలో ఎవరు ఎవర్ని పెళ్లిచేసుకోవాలో, ఎవడికి యెప్పుడు ఏమేమి జరుగుతాయో, ఇవన్నీ బ్రహ్మదేవుడు మనని పుట్టించేటప్పుడే మన నుదుటిమీద రాసేస్తాడు. సుశీలకూడా అలా నొసటిమీద రాసే ఉంటాడుగా మరి? అంచేతనే ఈశ్వరుడు అలా అడిగాడు.

"ఈ యిద్దరిలో ఎవడికీ దక్కదీ పిల్ల" అన్నాడు బ్రహ్మదేవుడు.

అలాగనేప్పటికి ఈశ్వరుడికి ఆశ్చర్యం వేసింది. "అలాగయితే, ఈ అమ్మాయికి కాబోయే మొగు డెవరో చూపించు," అని నిగ్గదీశా డాయన.

అప్పుడు బ్రహ్మ, ఆనగరంలో రాజవీథిని దున్నపోతునెక్కి వస్తోన్న ఓ కుంటివాణ్ణి చూపించి, "ఆ వచ్చే కుంటివాడే ఈ పిల్లకి భర్త ఔతాడు" అని చెప్పి ఊరుకున్నాడు.

ఈ మాటలు వినేటప్పటికి ఈశ్వరుడికి చాలా ఆశ్చర్యంవేసింది. "నవమన్మథుల్లాంటి కుర్రవాళ్లిద్దరు ఇక్కడ కాచుకుని కూచుంటే, ఆఖరికా కుంటివాడికి పెళ్ళాఔతుందా ఈ పిల్ల? అలా ఎన్నటికీ జరగదు" అన్నాడు.

అప్పుడు బ్రహ్మ, ఈ "పిల్లకి నేను అలా రాసి పడేశాను. ఆ రాత ప్రకారం జరగవలసిందే కాని మరోలా అవడానికి వీల్లేదు" అని ఖచ్చితంగా చెప్పేశాడు.



ఈశ్వరుడు "ఎందుకు వీల్లేదో చూద్దాం" అని చెప్పి, విష్ణుమూర్తితో "విష్ణుమూర్తీ, నువ్వు కాస్సేపు ఇలా నాఎద్దుమీదికి వచ్చి కూచోవోయి. నీ వాహనమైన గరుత్మంతుడికి ఓ పని చెప్పాలి" అన్నాడు.

విష్ణుమూర్తి గరుత్మంతుణ్ణి వదిలేక ఈశ్వరుడు "పక్షిరాజా, చూడు. నడవలేక, దున్నపోతునెక్కి వస్తున్నాడే. ఆకుంటివాణ్ణి తీసుకెళ్లి, సప్తసముద్రాలకూ అవతల ఉన్న అడవిలో దిగవిడిచి, చక్కారా" అన్నాడు. చెప్పిందే తడవుగా గరుత్మంతుడు నగరంలోకి వ్రాలి, ఆ కుంటివాణ్ణి అమాంతంగా కాళ్లతో తన్నుకుపోయి, ఏడుసముద్రాలకూ అవతలఉన్న అధ్వాన్నపు అడవిలో పడేసి చక్కా వచ్చాడు.

అప్పుడు ఇక ఈశ్వరుడు "రాజాంతఃపురములో ఉన్న సుశీల ఆ నట్టడవిలో ఉన్న కుంటివాణ్ణి ఎలా పెళ్లి చేసుకుంటుందో చూద్దాంగా" అని, బ్రహ్మదేవుడికేసి వేళాకోళంగా ఓ చూపు చూశాడు.

'పిల్లికి చెలగాట మవుతే ఎలకకి ప్రాణసంకట మన్నట్లు, ఆ కుంటివాడికి లేనిపోని కష్టం వచ్చిపడింది. ఆ ఊళ్లో ఉన్నప్పుడు యింటింటికీ వెళ్లి బిచ్చమెత్తుకుని



పొట్టపోసుకునేవాడు. ఇంక ఈ అడవిలో వాడికి అన్నంపెట్టేవా రెవరు? ఆ పక్షి తీసుకొచ్చి అడవిలో పడేసి, తనని దిక్కుమాలిన పక్షిని చేసిపోయినందుకు వాడు గోలపెట్టేడు. ఎండ ఎక్కినకొద్దీ వాడికి ఆకలిబాధ ఎక్కువై, "అయ్యో, దేవుడా, నా గతేంగాను?" అని విష్ణుమూర్తికి మొరపెట్టుకున్నాడు. ఆ దేముడికి వాడి ఏడుపు వినబడి జాలివేసి గరుత్మంతుడితో "పాపం ఆకుంటివాడికి ఆకలేస్తోంది. తినుబండారాలేవైనా పట్టుకెళ్లి వాడి ముందర పడేసిరా" అని ఆజ్ఞాపించాడు.



గరుత్మంతుడు విష్ణుదేవుడి ఆజ్ఞ ప్రకారం బయల్దేరి వెళ్లి, ఎక్కడైనా తినుబండారాలేమైనా కనపడతాయేమోనని, మెడ నిక్కించి చూశాడు. అప్పుడతనికి రాణిగారి అంతఃపురంలో బోనకావడి ఒకటి కనిపించింది. ఆ కావడివద్ద వాలేటప్పటికి, అందులోంచి గప్పున పిండివంటలవాసనలు కొట్టేయి. గరుత్మంతుడా కావడిని యెత్తుకుపోయి ఏడు సముద్రాలూ దాటి, అడవిలో కుంటివాడి ముందు పడేసి, "కడుపునిండా తిను" అని చెప్పి తప్పున ఎగిరి వచ్చి, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులవద్ద వ్రాలేడు.

కుంటివాడు భక్షణాలు తిందామని దేక్కుంటూ వచ్చి, ఆ గంప మూత తెరిచాడు. అందులోంచి చటుక్కుని ఓ అమ్మాయి లేచి నిలబడి, తన చేతులో ఉన్న పూలదండని గబుక్కుని ఆ కుంటివాడి మెడలో వేసేసింది. వాడు నిర్ఘాంతపోయి చూస్తోంటే దోసిళ్ళతో తలంబ్రాలు తీసి వాడి నెత్తిమీద పోసేసింది. వాడు ఆశ్చర్యాన్ని అపుకోలేక అ పెళ్లికూతుర్ని, "నువ్వుచూస్తే ఓఅందమైన రాజకుమార్తెలాగున్నావ్. నేను, పూటకు తిండానా లేని కుంటివాణ్ణి. నన్ను నువ్విలా పెళ్ళాడా వేమిటి?" అని అడిగేడు.

పెళ్లికూతురు తనకథ యిలాచెప్పింది:-

"నేను మీ రన్నట్లు రాజకుమార్తెనే. నా పేరు సుశీల. మా అమ్మ నన్నేమో వాళ్ళ అన్నగారి కొడుక్కిచ్చి పెళ్లిచేద్దామని నిశ్చయించుకుని, నాకీ పూలదండా తలంబ్రాలూ యిచ్చి, ఈగంపలో కూచోపెట్టింది. రెండో గంపలో పిండివంటలు పెట్టింది. 'ఈ కావడిని, నీకు కాబోయే భర్త దగ్గిరికి పంపుతాను. అతడు మూత తెరవడంతోటే అతణ్ణి వరించ'మని చెప్పి, వెళ్లింది. మరి కొంతసేపటికి ఈ కావడిని ఎవరో ఎత్తుకు

పోతోన్నట్లయి, లోపల నున్న నేను మా అమ్మ పంపదలచిన చోటుకే వెడుతున్నా ననుకున్నాను. మీరు మూతతెరపటంతోటే మా అమ్మ చెప్పినట్లు మిమ్మల్ని పెళ్ళాడాను."

ఈ కథంతా విని కుంటివాడు, తన అదృష్టానికి పొంగిపోయాడు. ఆకలేస్తోం దేమో, ఆవిడ తెచ్చిన పిండివంటలు ఒక్కటొక్కటే తింటూ, జరిగినదంతా తెలుసుకుని ఆశ్చర్యపోయాడు.

అక్కడ రాజాంతఃపురంలో బోనకావణ్ణి గరుత్మంతుడు ఎత్తుకుపోవడం రాణి చూసింది. కాని 'దొంగలతల్లికి యేడవ భయ'మన్నట్లు గప్‌చిప్‌గా ఊరుకుంది.

పెండ్లికి ముహూర్తం ఆసన్నమైంది. రాజుగారు పెళ్లికూతుర్ని వెదుక్కుంటూ వచ్చి, కనపడకపోయేసరికి 'సుశీల ఏదీ?' అని రాణీని అడిగేడు.

అప్పుడురాణీ ఒక్కమాటు ఎక్కడలేని కోపం తెచ్చుకుని, "ఏమో, నాకేం తెలుసు? ఎప్పుడయితే మీరు దాని పెళ్ళివిషయంలో నేను జోక్యం కలుగజేసుకోడానికి వీల్లేదని చెప్పేశారో, ఆ క్షణంనుంచీ నేను దాని సంగతే కలుగచేసుకోటంలేదు. నా మాట మీరు విననప్పుడు నాకీ సంసారంతో



పనేమిటి? ఎక్కడుందో వెతుక్కోండి" అని దబాయించేసింది! పాపం రాజు తాను తలపెట్టిన పెళ్లి కాకపోగా, అమ్మాయి కనపడక విచారిస్తో వెళ్లిపోయాడు.

పెళ్లికూతురు మాయమైందని తెలియడంతోటే, పెళ్లికొడుకు లిద్దరూ సిగ్గుపడి తేలుకుట్టిన దొంగలకి మల్లే కిక్కురు మనకుండా రహస్యంగా ఎవరిదారిని వారు వెళ్లేరు. వాళ్లు తెల్లమొహాలు వేసుకు పోతోంటే ఈశ్వరుడు చూచి, "ఏమయ్యా! బ్రహ్మదేముడుగారూ, ఆఖరికి ఆపిల్ల వీళ్లల్లో ఒక్కడికీ దక్కలేదన్నమాట!" అన్నాడు.

"ఎందుకు దక్కుతుందీ? నే చెప్పేనుగా? ఆ పిల్ల ఆ కుంటివాణ్ణి పెళ్లిచేసుకుని, ఏడు సముద్రాల కవతల అ డ వి లో వాడితో కబుర్లు చెప్పుతోంది" అని బ్రహ్మదేవుడు చిరునవ్వు నవ్వుతో పలికేడు.

ఈశ్వరుడు ఆ మాట నమ్మక, "ఏదీ? అక్కడికి పోయి చూద్దాం" అన్నాడు.

అప్పుడు వాళ్లు ముగ్గురూ, బ్రాహ్మణ వేషాలువేసుకుని, సప్త సముద్రాల కవతల అడవికి వెళ్లి ఆ పెళ్ళికూతుర్నీ, పెళ్ళి కొడుకునూ చూశారు. అప్పుడా దంపతులు ఎవరో బ్రాహ్మలొచ్చారని అనుకొని భక్తిశ్రద్ధలతో ఆ త్రిమూర్తులని గౌరవించి, తినడానికి భక్షణాలూ, తాగడానికి నీళ్లూ యిచ్చారు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ప్రత్యక్షమై, వాళ్ళకి వరాలిచ్చారు. విష్ణుమూర్తి "ఇంత అందమైన అమ్మాయికి మొగుడు కుంటివాడుగా ఉండడం బాగుండలే" దని వాడికి కాళ్ళు వచ్చేటట్లు వరం యిచ్చాడు. బ్రహ్మదేవుడేమో వాడి ఆయుర్దాయం పొడిగించేసి, ఆ అమ్మాయికి ఐదోతనం యిచ్చాడు. ఈశ్వరుడేమో, వాడికి అందం, ఐశ్వర్యం, జ్ఞానంఇచ్చాడు. ఇచ్చేసి అతడు బ్రహ్మతో, "నువ్వెలాగైనా చాలా గట్టివాడవయ్యా. నువ్వు రాసినరాత తప్పలేదు" అని మెచ్చుకున్నాడు.

ఈ లోపుగా విష్ణుమూర్తి గరుత్మంతుడితో ఈదంపతుల్ని మళ్లీ ఆ రాజాంతఃపురంలో విడిచిరావోయ్" అని ఆజ్ఞాపించాడు. అతడలా చేసి వచ్చాక, ఆ త్రిమూర్తులూ తమ తమ లోకాలకి వెళ్ళిపోయారు.

జరిగిన సంగతంతా సుశీల తల్లితండ్రులతో చెప్పి, భర్తను చూపించింది. వారు అల్లుణ్ణి చూసి, సంతోషించారు. రాజు అల్లుణ్ణి సేనాధిపతిగా చేశాడు. సుశీలా మొగుడూ సుఖంగా ఉన్నారు.






ఒకప్పుడు ఒక పూరిలో గొప్పవారి యింట అతివైభవంగా పెళ్లి జరుగుతున్నది. ఆ వివాహానికి అనేకమంది వచ్చారు. విధీ, విరామం లేకుండా సంతర్పణలూ సమారాధనలూ జరుగుతున్నాయి. పెళ్లి పందిట్లో వేసే విస్తళ్ళు వేస్తున్నారు, లేచేవాళ్ళు లేస్తున్నారు. అ హడావిడి ఇటువంటిదీ అని చెప్పటానికి వీలులేకుండా వున్నది.

ఒకరోజు విందులో, ఇద్దరు బ్రాహ్మలు ఒక బంతిని కూర్చోవటం తటస్థించింది. అందులో ఒకాయన కబుర్లపోగు. పెళ్లివారిచ్చిన విసనకర్రతో ఆయన సావకాశంగా విసురుకుంటూ, ఇంత గొప్పగా సంతర్పణ చేస్తున్న పెళ్లి యజమానిని ఒకవంక పొగడుతూ, చేసిన పదార్థాలను మెచ్చుకుంటూ, లొట్టలు వేసుకొంటూ ఊసులు చెబుతున్నాడు. రెండవ బ్రాహ్మణుడు కొంచెం పరధ్యానంగా ఉంటున్నాడు. అందుచేత, వడ్డన గురించి ఆయనకు అంతగా దృష్టిలేకపోయింది.

ఆ రోజున బంతికి పెళ్లివారు ప్రత్యేకంగా, పసందయిన మామిడిపళ్లు తెప్పించి వడ్డన చేయించారు. అవి అపురూపమైన మేలురకంపళ్లు కావటంచేత చాలా రుచిగా ఉన్నాయి.

మన బ్రాహ్మడు మామిడిపండు తింటూవుండగా, దానిలోని టెంక కాస్తా జారి పక్కనున్న బ్రాహ్మడి విస్తట్లో పడింది.

మన బ్రాహ్మడు "అయ్యో, ఇంకేమున్నది! ఆయన ఎటువంటివాడో మనకు తెలియదాయె. సగం భోజనంలో కోపగించి లేచేపోతాడో, పేచీయే పెడతాడో" అని హడలిపోయాడు. 'ఇవాళ పెద్ద పొరపాటు జరిగిందికదా' అనుకొని విచారించాడు.

పండ్రవాడ శ్రీ వేంకట లోవరావు - రావికంపాడు

ఈ గండం ఎలాగ తప్పుతుందా అనే ఆలోచన అతని మనసులో పీకుతున్నది.

తన విస్తట్లో ఎంగిలిటెంక పడినసంగతి గుర్తించకుండానే, ఆ రెండవ బ్రాహ్మడు అటువేపుతిరిగి తనపక్కవానితో మాటాడుతున్నాడు. తరువాత కొంతసేపటికి తన విస్తట్లో చూచుకోగా రెండు టెంకలు కనపడ్డాయి.

పరధ్యానంగా ఉన్న ఆయన, మన బ్రాహ్మడిని పలకరించి "ఏమండోయి శాస్త్రుల్లుగారూ! చూచారో లేదో కాని, నా మామిడిపండులో రెండు టెంకలున్నాయి సుమండీ! ఇటువంటి చిత్రం మనమెన్నడూ కనలేదు, వినలేదు!! ఏమంటారు?" అని అన్నాడు.

ఈ మాట వినగానే, టెంక జారవిడిచిన బ్రాహ్మణు "భేష్, బాగాఉన్నది. పరమేశ్వరుడు నాకు గండం తప్పించటానికే ఈ దారి కనబరిచినట్టు తోస్తుంది" అని అనుకొని సంతోషించి—

"అయ్యా! మీరు మామిడిటెంకను గురించిన చిత్రం ఒక్కటే సెలవిచ్చారు. విచిత్రం కూడా ఒకటున్నది. మనవి చేస్తా వినండి: మీ మామిడిపండులో కవలపిల్లల లాగ రెండు టెంకలున్నాయి సరే. నా మామిడిపండులో అసలు టెంకేలేదు. ఇది విచిత్రమంటారా, కాదా?" అని తమాషాగా సమర్థించుకొన్నాడు.

ఈ వింతలను చూచినవాళ్లూ, వీటిని గురించి విన్నవాళ్లూ పొట్ట చెక్కలయేటట్టు నవ్వుకొన్నారు. ఇంతకూ, అసలు రహస్యం ఒక్కళ్లకూ తెలియనేతెలియదు.

పొరబాటు అనేది అందరకూ వస్తుంది. అయితే, బుద్ధిబలము ఉపయోగించి, దానిని సమర్థించుకొనటంలోనే మానవుడు తెలివితేటలు కనపరచాలి.



## చందమామ పజిల్
(భాషాభివృద్ధికి)

### ఆధారములు

**అడ్డము :**

2. ఒక ఊరు పేరు
4. తల్లి
6. పన్నెండు అంగుళాలు
7. శిరస్సు
8. నవరత్నాల్లో ఒకటి
10. వచ్చుట
12. ఆజ్ఞ
14. పిచ్చితనము
15. కొందరికి దీని వానన పడదు




**నిలువు :**

1. అల్లుడు
2. ఆహారము
3. లేత
5. ఆలోచన
6. ఇంద్రుని పట్టణము
11. ఇనుము మొదలైన వాటితో పనిచేయువాడు
12. ఒక అంకె
13. నెత్తురు త్రాగునది

## ముగ్గులు



డి. కమలకుమారి, బాపట్ల



యస్. ఇందిర, బొంబాయి

# వీరబల్  వినోదాలు

ఒకప్పుడు అక్బరుఫాదుషా సంతోషంగా వుండే సమయం కనిపెట్టి వీరబలుడు "ప్రభూ! నాదొక చిన్నకోరికవున్నది. ఏలిన వారు సరేనంటే మనవి చేసుకొంటా" నన్నాడు.

"చెప్పవోయ్, నీకు అటంకమేమిటి?" అన్నాడు ఫాదుషా.

దానికి వీరబలుడు "మరేమీ లేదండి. మానవజన్మ యెత్తిన ప్రతివాడూ తప్పు చేస్తూనే వుంటాడు. ప్రజలూచేస్తారు, ప్రభువులూ చేస్తారు. ఈసారి నావల్ల ఏదయినా పొరబాటు వచ్చినట్టయితే, విచారణచేసే పంచాయతీదారులను నేను ఎన్నుకోవటానికి అనుమతి యిప్పించాలి" అని విన్నవించాడు.

"ఏమిటో అనుకున్నాను. గొప్ప కోరికే కోరావే. అలానే కానీ" అని అక్బరు అభయ మిచ్చాడు.

ఈ ధైర్యంతో వీరబలుడు మరి కొద్ది రోజులకే, కావాలని తప్పు చేశాడు. ఆ తప్పుకి పదిహేనువందల రూపాయలు ఇచ్చుకోమని ఫాదుషా తీర్పు చెప్పాడు.

ఫాదుషా తీర్పు చెప్పగానే, వీరబలుడు ఆ నాటి వాగ్దానం జ్ఞాపకంచేశాడు. "సరే ఎప్పుడైనా మేము మాటతప్పుతామా? నీకు నచ్చినవాళ్లను ఎంచి తెచ్చుకో" మని అక్బరు అనుజ్ఞ యిచ్చాడు.

"నేను ఎంచుకోవడమేమిటి ప్రభూ! తామే రప్పించండి. పంచాయతీదారులు పంచములయివుంటే చాలు, నాకు సమ్మతమే" అని వీరబలుడు తన మనసులో వుద్దేశం తెలిపాడు.

"వీరబల్! నీకు మతి ఉన్నదా లేదా? మాలవాళ్లేమిటి, తీర్పు చెప్పడమేమిటి?" అని ఫాదుషా మందలించాడు.

"ప్రభువులు మన్నించాలి. వాళ్ళుతీర్పు చెప్పలేకపోవడ మేమిటండి? వాళ్లు నాకు సోదరులు. న్యాయస్థానంలో ఎవళ్లకయినా తీర్పు ఒక్కటే కాని, గొప్ప బీద అనే తార

'దా మూ'



తమ్యం ఉండదు కదా" అని వీరబలుడు బదులు చెప్పాడు.

చేసేదిలేక, ఫాదుషా మాలపల్లె నుంచి అయిదుగురుని రప్పించి, వీరబలుడు చేసిన అపరాధం వాళ్ళకు విప్పిచెప్పాడు. అంతా విని పంచాయతీదారులు రహస్య మందిరంలోకి పోయి చర్చచేశారు.

ఆ చర్చలో ఒకరిమాట ఒకరికి పొంద లేదు. నూటయాభైరూపాయిల జరిమానా వేయాలనివారు మొదటఅనుకొన్నారు. కాని వాదం పూర్తిఅయేసరికి అది యాభై రూపా యలకు దిగింది. ఒక నిశ్చయం జరిగిన తరువాత పంచాయతీదారులు ఫాదుషా వద్దకు వచ్చి, '[ప్రభూ] ముద్దాయికి శిక్ష తగ్గించటానికి ఎంతో ప్రయత్నించాము. కాని, వీరబలుడు చేసినది చాలా పెద్ద తప్పు. అందుచేత యాభైరూపాయల జరిమానా వేయవలసివచ్చింది. సామాన్య సంసారికి ఇదైనా భరించడం కష్టమని మాకుతెలుసు. కాని, న్యాయశాస్త్రం విధిం చిన దానికి మేమేం చేయగలము?" అని తమ తీర్పు తెలియచేశారు.

తీర్పు విని ఫాదుషా ఆశ్చర్యపోయాడు.

మానవుడు తన తాహతునుబట్టి లోకంలో ఏవిషయమైనా నిర్ణయిస్తాడు. సాధారణంగా మాలవాడు జీవితంలో ఎక్కువధనం కళ్ల చూడలేడు. అందుచేత ధనవంతుల తాహతు ఎటువంటిదో వాడిఊహకు అందదు. మానవునియొక్క ఈ మనస్తత్వం తెలిసినవాడు గనకనే వీరబలుడు సామా న్యులను పంచాయతీదారులుగా ఎంచు కొన్నాడు.

వీరబలుడు చేసిన యుక్తికి మెచ్చుకొని ఫాదుషా అతనికి అంతకుముందు విధించిన జరిమానా రద్దుచేయటమే గాక, బహుమతులిచ్చి సత్కరించాడు.






# పిల్లల పెంపకం

## దుస్తులు

మనిషికి తిండి యెంత ముఖ్యమో, బట్ట కూడా అంత ముఖ్యమే. కిందటి సారి అహారమును గురించి చెప్పాను. ఇప్పుడు దుస్తులను గురించిచెబుతాను.

బట్టలు తొడుగుకొనటంవల్ల శరీరమునకు అవసరమయిన శీతలము, వేడి. ఎక్కువ తక్కువలు లేకుండా, సరిసమానంగా అమరివుంటాయి.

బిడ్డలు ధరించే దుస్తుల విషయంలో ముఖ్యంగా గమనించవలసిన మెలకువ లున్నాయి: ఒంటిమీది చెమట బయటకు పోవటానికీ, బయటిగాలి ఒంటికి సోకటానికీ అనుకూలించేటట్టు దుస్తులు వదులుగా ఉండాలి.

బరువయిన ముతకబట్టలూ, బిగువుగా వుండే బట్టలూ, ఎదిగే బిడ్డల శరీరానికి అటంక మవుతాయి. అటువంటి దుస్తులు పసివాళ్ల శరీరంలో రక్తాన్ని సరీగా ప్రవహించనీయవు. ఒక్కొక్కప్పుడు ఊపిరి పీల్చుటలో కూడా ఇబ్బంది కలిగించవచ్చు.

పిల్లలు సామాన్యంగా లాగు బొందులు గట్టిగా బిగించుకొంటారు. దీనివల్ల పొత్తికడుపు నాచుకుపోవటమే గాక, మొలగజ్జి పుట్టడానికి అవకాశ ముంది. ఇటువంటి అలవాటున్న పిల్లలను కనిపెట్టి, తరుణంలో మందలించాలి.

గొప్పకోసం, పిల్లలకు విలవయిన దుస్తులు కుట్టించామని సంతోషిస్తే లాభం లేదు. మాపుకి అగుతవి కదా అని కన్నులు జిగాలుమనే రంగుబట్టలు తొడుగుతారు. అదీ అంత మంచిది కాదు.

బిడ్డల దుస్తులు తేలికగా, వదులుగా, మనసుకి ఉత్సాహం కలిగించే లేత రంగులో, ఎల్లప్పుడు పరిశుభ్రంగా ఉండాలి. మంచిదుస్తులు వేసుకొన్న పిల్లలు ఎంతో ఆరోగ్యవంతముగా వుంటారు.

---

మీ పెద్దమ్మ

---



ఈ చదరం మధ్యని వున్న చీరెలను పైన వున్న ఆరుగురు స్త్రీలలో ఒకరుమాత్రమే తెచ్చుకోగలరు. ఆమె ఎవరో కనుక్కోండి.

---

12-వ పేజీలోని చిక్కు బొమ్మలకు జవాబు:

4, 9 నెంబర్లుగల బొమ్మలు రెండూ తేడాగా ఉన్నాయి.

# జోల పాటలు

[వంకదారు సాత్యకిరావు, దోనపాడు]

రావాకు చిలకమ్మ ఆడవే పాప
రాజుల్లు నీచెయ్యి చూడవచ్చేరు
ప్రధాన పుంగరము పమిడివత్తుల్లు
గణగణావాయించి గంట దెప్పించి
గజంబరాయుడు తా తర్లిరాగా
అన్న అందలమెక్కె తాగుర్ర మెక్కె
గుర్రంబుమీదికి పల్లంబుదేరే
పల్లంబుమీదికి బాలుణ్ణితేరే
బాలుడు ముందరికి బాలికనుదేరే
బాలిక శిఖలోకి కురువేరుతేరే
ననుగన్న తల్లికి నానుతేరమ్మ
నాకొక్క ముత్యాల బొట్టు తేరమ్మ
బొట్టుకు బొమ్మంచు చీరె తేరమ్మ
చీరకు చిలకల్ల రవికె దేరమ్మ
రవికకు రత్నాలపేరు దేరమ్మ
పేరుకు పెట్టెల్ల సొమ్ము దేరమ్మ
సొమ్ముకు శోభిల్ల వళ్ళుదేరమ్మ
వంటికి వడుగంటి పసుపు దేరమ్మ
పసుపుకు పారేటి నీళ్ళు దేరమ్మ
నీళ్ళకు నిత్యమల్లి చెట్లు దేరమ్మ
నిత్యమల్లికింద నీళ్ళ కుండల్లు
నీళ్ళ కుండలమీద రామచిలుకల్లు
రామచిలుకల మెడలొ రత్నాల పేర్లు.

# మూలలు ఎన్ని?

[మునిపల్లి రామారావు, తెనాలి]

మూలలు ఎన్నియొ అన్నయ్యా!
చక్కగ చెప్పుము అన్నయ్యా?
మూలలు నాలుగు చెల్లాయీ,
చెప్పెద వినుమో చెల్లాయీ.
ఇదిగో ఇదిగో ఈశాన్యం,
ఉత్తర తూర్పుల సంయోగం;
అదిగో అదిగో ఆగ్నేయం,
దక్షిణ తూర్పుల సంయోగం;
అల్లదె నైరృతి చెల్లాయీ,
దక్షిణ పడమర కలిసాయీ;
ఉత్తర పడమర మధ్యాన్ని,
బాగుగ చూడుము వాయవ్యం;
చక్కగ చెప్పితి వన్నయ్యా
నేనును నేర్చితి నన్నయ్యా.

పజిలుకు జవాబు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 జా | ■ | ■ | ■ | 2 కూ | 3 నూ | రు |
| 4 మా | 5 త | ■ | 6 అ | డు | గు | ■ |
| 7 త | ల | ■ | మ | ■ | ■ | ■ |
| ■ | 8 పు | ష్య | రా | గ | 9 ము | ■ |
| ■ | ■ | ■ | వ | ■ | 10 రా | 11 క |
| ■ | 12 ఆ | 13 న | తి | ■ | 14 రి | మ్మ |
| 15 సీ | రు | ల్లి | ■ | ■ | ■ | రి |



# విజ్ఞానంలోని గమ్మత్తులు

ఇదుగో– ఇప్పుడు నే చెప్పబోయే తమాషా చేశారంటే, ఇటువంటి గమ్మత్తు ఎన్నడూ చూడలేదే! అని చెప్పి, పిల్లలే కాదు, పెద్దలు కూడా ఆశ్చర్య పోతారన్న మాట.

ఇందుకు కావలసిన వస్తువులు:— ఒక గాజు జాడీ, అప్పడాల సోడా, నిమ్మపండు, కలరా (నెఫ్తలిను) ఉండలు; నీళ్ళు.

వీటితో చేయవలసిన పని:— గాజుజాడీని మూడువంతుల వరకూ నీటితో నింపి, అందులో చెంచాడు సోడా కలిపి, గిలకరించాలి. తరువాత, గింజలు లేకుండా చూసి, నిమ్మపండు రసం ఆ నీటిలో కలపాలి.

అన్నీ కలిసిన ఆ నీళ్ళలో అయిదారు నెఫ్తలిను ఉండలు పడవేసి, చిత్రం చూడండి: నెఫ్తలిను ఉండలు, చక్కా వరసగా, ఒకదాని వెనుక ఒకటి పోలీసువాళ్ళ లాగ, పైనించి కిందికీ, కిందినించి పైకీ తిరుగుతాయి.

ఒకవేళ— ఉండలు తిరగటం మందముగా ఉన్నదీ, ఇంకా గబగబా తిరిగితే బాగుండును అని తోస్తే, అవసరాన్ని బట్టి మరికొంచెం సోడాగాని, నిమ్మరసం కాని చేర్చుకోవచ్చు.

ఆ నెఫ్తలిను ఉండలు జాడీలో గిరగిర తిరుగుతూ వుంటే, అది చూచినవాళ్ల మనస్సు కూడా ఉత్సాహంతో ఊగిపోతుంది. వాళ్లందరూ ఈ తమాషా చేయ గలిగినందుకు మిమ్మలిని ఎంతగానో మెచ్చుకొంటారు.

వచ్చేనెల దీనిని మించిన గమ్మత్తులు చెబుతా.



Chandamama, March '49

Photo by T. D. Srinivasan, M.A.

"ఇంకా ఉన్నయ్యనుకున్నావా అక్కడ? ఎప్పుడో నా కడుపులోకి పోయిన్నై!"

